ర్జరవరు లూఁది మహిమ,
త్వరమున వడిఁ ద్రచ్చి ద్రచ్చి జవ మఱి యున్నన్. 13

క. నారాయణుండు వారిక
వారితజవసత్త్వములు ధ్రువంబుగ నిచ్చెన్
వారును దొల్లిటికంటె న
పారప్రారంభులై రపరిమితశక్తిన్. 14

చ. ఉడుగక యొండొరుం జఱచి యొక్కబలంబున దేవదానవుల్
వడిగొని వార్ధి నిట్లు దఱువం దఱువన్ విష ముద్భవిల్లి న
ల్గడలను విస్ఫులింగములు గప్పఁగఁ బర్విన దానిఁ జెచ్చెరన్
మృడుఁడు గడంగి పట్టుకొని మ్రింగి గళంబున నిల్పెఁ
బొల్పుగన్. 15

వ. మఱియు నమృతంబును జ్యేష్ఠయుఁ జంద్రుండును శ్రీయును
నుచ్చైశ్శ్రవంబును గౌస్తుభంబును ధన్వంతరియు నాదిగా
ననేకంబు లుద్భవిల్లిన నందుఁ ద్రిభువనవంద్య యయిన శ్రీ
దేవియు నిజప్రభాపటలపర్యస్తప్రభాకరగభస్తివిస్తరం
బయిన కౌస్తుభంబును నారాయణవక్షస్స్థలంబున విలసిల్లె
నుచ్చైశ్శ్రవం బనుయుగ్యంబు సురరాజయోగ్యం బయ్యె
నంత నయ్యమృతంబు నసురులు చేకొనిన. 16

క. నారాయణుండు కృత్రిమ
నారీరూపమునఁ దన్మనంబున కతిమో
హారంభకారుఁ డై యము
రారులచేఁ గ్రమ్మఱంగ నమృతము గొనియెన్. 17

వ. ఇట్లుపాయంబున నసురుల వంచించి యమృతంబు గొని విష్ణుదేవుండు దేవతల కిచ్చిన నయ్యమృతంబు దేవత లుపయోగించుచో దేవరూపంబుదాల్చి రాహువు వేల్పులబంతి నయ్యమృతం బుపయోగింపం బోయినం దత్సమీపంబున నున్నచంద్రాదిత్యులు వాని నెఱింగి నారాయణునకుం జెప్పిన నయ్యమృతంబు వానికంఠబిలంబు సొరకముందఱ.

క. అసురారినుక్తనుండు చ
క్రము గ్రక్కున నేయ రాహు కంఠము ద్రెగి దే
హము ధరణిం బడియెం దన్ముఖ
మమృతస్పర్శమున నక్షయంబై నిలిచెన్. 19

వ. నాఁటంగోలె రాహువునకుం జంద్రాదిత్యులతోడివిరోధంబు శాశ్వతం బయి ప్రవర్తిల్లుచుండె. 20

—♦ దేవదానవులయుద్ధము. ♦—

సీ. అంత దేవాహితు లమృతంబు గానక
యెంతయు నలిగి బలీంద్రుఁ గూడి
మంతనం బుండి యమర్త్యులతోడి పొ
త్తింతియ చాలు నింకేల యనుచు
సంతనకట్టి యుత్సాహసమేతులై
యంతంబు లేనిరథాశ్వములను
దంతుల నమితపదాతుల నొడఁగూర్చి
యంతకాకారులై యార్చి యమర

ఆ. వరులఁ దాఁకి యేసి కరుకుతరశరపక్ష
జాతవాతరయవిఘాత మగుచుఁ
జెదర జలదపంక్తి బెదర వజ్రియుధు
హృదయ ముదిలకొనఁగఁ దిగ్దిశగణము. 21

మహాస్రగ్ధర. అమరేంద్రారాతు లిట్లాహవముఖమున నే
యంగఁ దత్తీక్ష్ణబాణౌ ఘము ఘోరంబై సురానీకము
పయిఁ బెలుచం గప్పినం జూచి దైత్యోత్తములం గోదండ
చక్రోద్యతభుజులు మహాదారుణుల్ వీరలక్ష్మీరము
ణుల్ దుర్వారవాత్యారయమున నరనారాయణుల్
దాఁకి రల్కన్. 22

మ. నరచాపప్రవిముక్తదారుణబృహన్నారాచధారల్ భయం
కరదైతేయనికాయకాయములపైఁ గప్పెన్ దిశల్ నిండ బం
ధురధాత్రీధరతుంగశృంగతటసందోహంబుపైఁ గప్పు దు
ర్ధరధారాధరముక్తసంతతపయోధారావళిం బోలుచున్.

మ. పతదుర్వీధరధాతునిర్ఝరజలాభం బై మహాదేహని
ర్గతసాంద్రారుణపూర మొక్కుమొగి నొల్కం దెస్సి
నారాయణోన్నతదోర్దండవిముక్తచక్రనిహతిన్ నాక
ద్విషన్మస్తకప్రతతుల్ ఘోరరణంబునం బడియె భూ
భాగంబు గంపింపఁగన్. 24

వ. ఇట్లు సముద్రతీరంబున నమరాసురులకు నతిఘోరయుద్ధం
బయ్యె నందు నరనారాయణు లపారపరాక్రములై యసు
రవీరులఁ బెక్కండ్రం జంపిన నుక్కడంగి దెసచెడి యసు

రులు సముద్రంబు సొచ్చిన నమరులు సమరలబ్ధవిజయులై యమరపతి నమృతరక్షణార్థంబు ప్రార్థించి యథాస్థానం బున మందరనగంబుఁ బ్రతిష్ఠాపించి తమతమనివాసంబుల సుఖం బుండి రంత 25

—• కద్రూవినత లుచ్చైశ్శ్రవముం జూచుట. •—

క. అమృతముతో నుద్భవ మై
యమరేశ్వరయోగ్య మైన హయరత్నము త
ద్విమలోదధితీరంబునఁ
గొమరుగ నేకతమ యిచ్చఁ గ్రుమ్మరుచున్నన్. 26

వ. కద్రువయు వినతయు వినోదార్థంబు విహరించువారు కరిమకరనికరాఘాతజాతవాతోద్ధూతతుంగతరంగాగ్రసము చ్చలజ్జలకణాసారచ్ఛటాచ్ఛాదిత గగనతలం బైనదాని ను ద్యానవనంబునుంబోలె బహువిద్రుమలతాలంకృతం బైన దాని నాటకప్రయోగంబునుంబోలె ఘనరసపాత్రశోభిత రంగరమ్యం బైనదాని దివంబునుంబోలె నహిమకరభరితం బైనదాని మఱియు 27

చ. అలఘుఫణీంద్రలోకకుహరాంతరదీప్తమణిస్ఫురత్ప్రభా
వలి గలదాని శశ్వదుదవాసమహావ్రతశీతపీడితా
చలమునిసౌఖ్యహేతువిలసద్బడబాగ్నిశిఖాచయంబులన్
వెలిఁగెడుదానిఁ గాంచి రరవిందనిభాననలమ్మహోదధిన్. 29

వ. మఱియును.

మ. వివిధోత్తుంగతరంగఘట్టనచల ద్వేలావనైలావలీ
లవలీలుంగలవంగసంగతలతా లాస్యంబు లీక్షించుచున్
ధవళాక్షుల్ సని కాంచి రంత నెదురం దత్తీరదేశంబునం
దవదాతాంబుజఫేనపుంజనిభు నయ్యశ్వోత్తముం దవ్వులన్

వ. కని కద్రువ వినతం జూచి చూడవె యల్లయతిధవళం బైన యశ్వంబునందు సంపూర్ణచంద్రునందు నల్లయుంబోలె వాలప్రదేశంబునందు నల్లనైయున్నది యనిన విని వినత నగి నీ వేకన్నులం జూచితే యక్కడ యెక్కడిది నల్ల యీ యశ్వరాజుమూర్తి మహాపురుషుకీర్తియుంబోలె నతినిర్మలంబై యొప్పుచున్నయది యనిన విని నవ్వి వినతకుం గద్రువ యిట్లనియె. 31

— కద్రూవినత లొండొరులు పన్నిదములు సఱచుట. —

తే. అమ్మహాశ్వంబుధవళదేహంబునందు
నల్ల గలిగిన నీ విప్డు నాకు దాసి
వగుము మఱియందు నల్ల లేదయ్యెనేని
నీకు నే దాసి నగుదుం బన్నిదము సఱము. 32

వ. అని యిట్లిద్దఱు నొండొరులకు దాసీత్వంబు పణంబుగా నొడివి పన్నిదంబు సఱచిన వినత యయ్యశ్వంబు డాసి చూతము రమ్మనినం గద్రువ యిప్పుడు ప్రొద్దులేదు రేప కడ చూత మని యిద్దఱు మగిడి తమనివాసంబులకుం బోయి యున్నయప్పుడు 33

సీ. కద్రువ కొడుకుల / కడ కేఁగి యేను మి
మ్మందఱ వేఁడెద / నన్నలార
నా పంపు సేయుఁడు / నన్ను రక్షింపుఁడు
కామచారులకు దు / ష్కరము గలదె
యొడలు తెల్లనితుర / గోత్తమువాలంబు
నల్ల సేసితి రేని / నాకు దాసి
యగు మనవినత మీ / రట్లు సేయనినాఁడు
దానికి మఱి యేను / దాసి నగుదు

ఆ. జంటపన్నిదంబు / సఱచితి మిట్లుగా
ననినఁ బాము లెల్ల / ననయ మిదియుఁ
దల్లి వనిచె నని య / ధర్మువు సేయంగ
నగునె యెఱుక గలరె / మగువ లెందు. 34

వ. అని యందఱుఁ దమలో విచారించి యధర్మారంభంబునకు సుముఖులు గాకయున్నఁ గద్రువ కోపోద్దీపితముఖి యై.

క. అనుపమముగ జనమేజయుఁ
డనుజనపతి సేయుసర్ప / యాగనిమిత్తం
బునఁ బాములు పంచత్వము
సనియెదు మని యురగములకు / శాపం బిచ్చెన్. 36

వ. అందు శాపానుభవభీతచిత్తుం డై కర్కోటకుం డనువాఁడు దల్లి పంచినరూపంబున నుచ్చైశ్శ్రవంబువాలంబు నీలం బుగాఁ బట్టి వ్రేలుచున్న మఱునాఁడు రేపకడయ కద్రువయు వినతయుం జని యత్తురంగంబుఁ జూచి వినత

యోటువడి కద్రువకు దాసి యై యోపిన పనులు సేయు
చున్నంతఁ బంచశతవర్షంబులు నిండి రెండవయండం బవి
సిన నందు. 37

—◆ వినతకు గరుడుండు జనించుట. ◆—

ఉ. ఆతతపక్షమారుతరయప్రవికంపితఘూర్ణితాచల
వ్రాతమహార్ణవుండు బలవన్నిజదేహసముజ్జ్వలప్రభా
ధూతపతంగతేజుఁ డుదితుం డయి తార్క్ష్యుఁడు తల్లికిన్
మనగ । ప్రీతి యొనర్చుచున్ నెగసె భీమజవంబున
నభ్రవీథికిన్. 38

క. దారుణకల్పాంతమరు
త్ప్రేరితహవ్యవహశిఖల పెల్లిది యని బృం
దారకమునిబృందస్తుతి
బోరనఁ దా నగ్నిసూక్తములతో నెసఁగెన్. 39

వ. అంత. 40

క. సూరికులిశక్షతి యెఱుఁగని
గురుతరపక్షములతోడి కులగిరిపోలెన్
గరుడుండు గగనగతి నురు
తరజవమున నరుగుదెంచి తల్లికి మ్రొక్కెన్. 41

చ. తడయక మ్రొక్కియున్నవినతాసుతు నప్పుడు సూచి
యాత్మలో । నిడుగడ్డ జేయుచుం గడు సహింపక కద్రువ
వానిఁ బిల్చి నా । కొడుకుల నెల్ల నెత్తికొని కుమ్మరు
చుండుమి యేమి పంచినన్ । మడవక చేయు మీ వని
సమర్పణ సేసె బ్రభుత్వ మేర్పడన్. 42

వ. గరుడుండును గద్రువ పంచినపను లెల్లను వినతయను
మతంబున నతివినయపరుండై చేయుచు. 43

క. ఆపన్నగముఖ్యులఁ దన
వీఁపునఁ బెట్టికొని పఱచి వివినములు మహా
ద్వీపములు గిరులు నిఖలది
శాపాలపురములుఁ జూపెఁ జని వారలకున్. 44

వ. ఒక్కనాఁడు సప్తమారుతజవంబున సప్తాశ్వమండలంబు
దాఁక నెగసిన నమ్మార్తాండుచండకిరణంబుల వేఁడిమి
దాఁకి మాఁడి గరుడునివీఁపున నున్నయురగులు దొరఁగి
నేలం బడి మూర్ఛపోయినం జూచి కద్రువ గడు నలిగి
గరుడునిం బదరి యతిభక్తి నింద్రు నారాధించి 45

చ. నరసురసిద్ధకింపురుష నాగనభశ్చరముఖ్యు లెల్ల నీ
కరుణయ వేచి యుందు రిజగంబులు నీ కులిశాభిరక్షణ
స్ఫురణన చేసి సుస్థిరతఁ బొందుఁ బురందర సర్వలోకసుం
దర శరణంబు నా కగుము దానవసూదన పాకశాసనా.

వ. అని స్తుతియించి పర్జన్యప్రసాదంబున మహావృష్టి గోడు
కులపయిం గురియించి యయ్యురగుల విగతపరితాపులం
జేసి కద్రువ గర్వంబున నుఱక గరుడుని వినతనుం బనులు
గొనుచున్నంత నొక్కనాఁడు గరుడుండు తల్లి కిట్లనియె.

ఉ. ఆయతపక్షతుండహతి నక్కులశైలము లెల్ల నుగ్గుగాఁ
జేయు మహాబలంబును బ్రసిద్ధియునుం గలినాకు నీపనిం
బాయక యొమ్మనం దెపుడుఁ బాముల మోవను వారికిం

బహుల్ । సేయను నేమికారణము సెప్పుము దీనిఁ బయో
రుహాననా. 48

వ. అని యడిగిన వినతతనయుం గద్రువతోడి పన్నిదంబున
నైనదాసీత్వంబును దత్కారణం బైనయనూరుశాపంబునుం
గొడుకున కేర్పడం జెప్పి యిట్లనియె. 49

క. నీకతమున నాదాస్యము
ప్రాకటముగఁ బాయు ననిన పలుకెదలోనం
జేకొని యాఁటడి నిర్గత
శోకస్థితి నున్నదానఁ జూవె ఖగేంద్రా. 50

వ. కొడుకులు సమర్థులైనం దల్లిదండ్రుల యిడుమలు
వాయుట యెందునుం గల యది గావున నీయట్టి సత్పు
త్త్రుం బడసియు దాసి నై యుండుదాన నే యనిన విని
వైనతేయుండు దద్దయు దుఃఖితుండై యొక్కనాఁడు
కాద్రవేయుల కిట్లనియె. 51

క. మాయీదాస్యము వాయును
పాయము సేయుండు నన్నుఁ బనుపుం డిష్టం
బేయది దానిన తెత్తు న
జేయుఁడ నై యమరవరులఁ జేకొని మైనన్. 52

వ. అనిన నయ్యురగులు గరుడున కిట్లనిరి. 53

చ. అమితపరాక్రమంబును రయంబును లావును గల్గుఖేచరో
త్తముఁడవు నీవు నీ దయిన దాస్యము వాపికొనంగ నీకుఁజి
త్తము గలదేని భూరిభుజదర్పము శక్తియు నేర్పడంగ మా

కమృతము దెచ్చి యిమ్మనిన నవ్విహగేంద్రుఁడు సంత
సంబునన్. 54

—◆ గరుత్మంతుఁ డమృతంబు దెచ్చుటకుఁ దల్లియనుమతి గొనుట. ◆—

వ. అట్లు చేయుద నమృతంబు దెచ్చి మీ కిచ్చి యేనునుం
దల్లియు దాస్యంబువలన విముక్తుల మగువార మని నొడివి
తద్వృత్తాంతం బంతయుం దల్లికిం జెప్పి యమృతాహర
ణార్థం బరిగెద నని మ్రొక్కిన వినత సంతసిల్లి కొడుకుం
గౌఁగిలించుకొని. 55

చ. అనిలుఁడు పక్షయుగ్మ మమృతాంశుఁడు వీఁపనలుండు
మస్తకం। బినుఁడు సమస్తదేహమును నెప్పుడు గాచుచు
నీ కభీష్టముల్ । ఘనముగఁ జేయుచుండెడు జగన్నుత
యున్నతియున్ జయంబుఁ జే। కొనుమని యిచ్చె దీవనలు
గోరి ఖగేంద్రునకుం బ్రియంబునన్. 56

వ. గరుడుండును దల్లిదీవనలు గైకొని గమనోన్ముఖుండై
యమృతంబు దెచ్చునప్పుడు లావు గలుగవలయు నా
కాహారం బుపదేశింపు మనిన వినత యిట్లనియె. 57

క. విషనిధికుక్షి నసంఖ్యము
నిషాదగణ ముండి ధారుణీపరిజనుఁ గదున్
విషమమును జేయు దాని ని
మిషమున భక్షించి చను మమిత్రవిఘాతీ. 58

వ. భక్షణవిషయంబున బ్రాహ్మణునిం బరిహరించునది యనిన
గరుడుండు నాకు బ్రాహ్మణు నెఱుంగు తెఱం గెఱింగింపు
మనిన నిట్లనియె. 59

క. రయమున మ్రింగుడు గాలము
క్రియ నెవ్వఁడు కంఠబిలము ౯ క్రిందికిఁ జన క
గ్నియపోలె నేర్చుచుండును
భయరహితా వాని నెఱుఁగు ౯ బ్రాహ్మణుఁగాఁ. 60

తే. కోపితుండైన విప్రుండు ౯ ఘోరశస్త్ర
మగు మహావిష మగు నగ్ని ౯ యగు నతండ
యర్చితుండైన జనులకు ౯ నభిమతార్థ
సిద్ధికరుఁ డగు గురుఁ డగుఁ ౯ జేయుఁ బ్రీతి. 61

వ. అని బ్రాహ్మణస్వరూపంబుఁ జెప్పిన నెఱింగి వినత వీడ్కొని గరుడుం డతిత్వరితగతిం బఱచి సముద్రోదరంబున నున్ననిషాదుల ననేకశతసహస్రసంఖ్యలవారిం బాతాళవివరంబునుం బోని తనకంఠబిలంబుఁ దెఱచి యందఱ నొక్కపెట్ట మ్రింగిన నం దొక్కవిప్రుం డుండి కుత్తుకకు డిగక నిప్పునుం బోలె నేర్చుచున్న నెఱింగి నాకంఠబిలంబున విప్రుం డున్నవాఁడేని వెలువడి వచ్చునది యనిన గరుడున కవ్విప్రుం డిట్లనియె. 62

ఉ. విప్రుఁడ నున్నవాఁడ నప ౯ విత్రి నిషాది మదీయభార్య కీ
ర్తిప్రియ దీనిఁ బెట్టి చను ౯ దెంచుట ధర్మువె నాకు నావు
డుఁ। విప్రులఁ బొంది యున్నయప ౯ విత్రులుఁ బూజ్యులు
గారె కావునఁ। విప్రకులుండ వెల్వడుము ౯ వేగమ నీవును
నీనిషాదియుఁ. 63

వ. అనిన నాగరుడునియనుగ్రహంబున బ్రాహ్మణుండు నిషాదీ సహితుండై వెలువడివచ్చి గరుడుని దీవించి యథేచ్ఛం జనియె గరుడుండును గగనంబునం బఱచి గంధమాదనం బునం దపంబుసేయుచున్న కశ్యపుం గని నమస్కరించి యస్మజ్జననీదాస్యనిరాసార్థం బురగుల కమృతంబు దేర నరిగెద నిషాదఖాదనంబున నాఁకలి వోవకున్నయది నా కాహారంబుఁ బ్రసాదింపు మనినఁ గొడుకుకడంకకు మెచ్చి కశ్యపప్రజాపతి యి ట్లనియె. 64

క. అనలనిభుండు విభావసుఁ
డనువిప్రుఁడు నియమవంతుఁ డర్థాఢ్యుం డై
తనరి సుఖ మున్న నాతని
యనుజన్ముఁడు సుప్రతీకుఁ డనువాఁ డతనిన్. 65

క. మనపితృవర్గము వడసిన
ధనము విభాగించి యిమ్ము ధర్మస్థితి నా
కని యడుగం బోయిన న
య్యనుజునకు విభావసుం డహంకారమునన్. 66

క. తా నలిగి యిచ్చె శాపం
బేనుఁగ వై యుండు మని సహింపక వాఁడున్
మానుగఁ గూర్మమ వగు మని
వానికిఁ బ్రతిశాప మిచ్చె వసులోభమునన్. 67

వ. ఇ ట్లన్నయుం దమ్ముండును నన్యోన్యశాపంబులం జేసి యోజనత్రయోత్సేధంబు గలిగి దశయోజనవృత్తం బైన

కూర్మంబును షడ్యోజనోత్సేధంబు గలిగి ద్వాదశయోజన విస్తృతం బైనగజంబును నై సరోవరవిపినంబుల నుండి యర్థనిమిత్తం బైనపూర్వవైరంబునఁ దమలో నిత్యంబు నొండొంటితోడం బెనంగి పోరుచుండు నవి నీ కాహారంబు సు మ్మరుగుము కార్యసిద్ధి యయ్యెడు మనిన గరుడుం డును మనోవేగంబునం బఱచి యారెంటినిం గాంచి. 68

క. చఱచి యొకచేతఁ గూర్మముఁ
బెఱచేత గజంబుఁ బట్టి పెనఁచి ఖగేంద్రుం
డిఱికికొని గగనవీథిం
బఱచె వియచ్చరవిమానపంక్తులు దూలన్. 69

క. కనకవ్రతతీవితతులఁ
బెనఁగినసురభూరుహములఁ బెద్దయు బెడఁ గై
తనరినయలంబతీర్థం
బున కరిగె నగంబు లొక్క మొగిఁ గ్రిక్కఱదలన్. 70

వ. అందు రౌహిణం బనుపాదపోత్తమంబు గరుడునిఁ గని సంభావించి శతయోజనాయతం బైనమదీయశాఖపై నుండి యిగ్గజకచ్ఛపంబుల భక్షించి పొమ్మనిన గరుడుండు నట్ల చేయుదు నని యమ్మహాశాఖపై నూఁద సమకట్టి యందు. 71

—◆ గరుత్మంతుండు గజకచ్ఛపంబులం గొని కశ్యపునొద్దకుఁ బోవుట. ◆—

క. పాదంబులు వెట్టుడుఁ ద
త్పాదపఘనశాఖ విఱిగి భల్లన నుచ్చై

ర్నాదమున దిక్కు లదుర్వఁగ
భేదిల్లె విహంగతతులు భీతిం బఱవన్. 72

వ. అమ్మహాశాఖ నవలంబించి తలక్రిందై యాదిత్యకిరణం బులు తమ కాహారంబుగాఁ దపంబు సేయుచున్న వాలఖిల్య మహామునిగణంబులం జూచి యిది భూమిఁ బడిన నిమ్మునులకు బాధ యగు నని దానిం గఱచికొని గజ కచ్ఛపంబులం గరంబుల నిఱికికొని గరుడుండు గగనంబునం బఱచి తనకు నూఁద నిమ్మగు ప్రదేశం బెందునుం గానక గంధమాదనంబునకుం జని యందుఁ దపంబు సేయుచున్న కశ్యపుం గనుంగొని మ్రొక్కిన. 73

చ. కనకమహీంధరప్రతిము కాయము మహాజవనిర్జితప్రభం జను నవిచింత్యభూరిబల సత్త్వసమన్వితు దీప్తహవ్యవా హనసము వైనతేయునిఁ దదాస్యగతద్రుమశాఖనున్న య త్యనఘుల వాలఖిల్యులను నమ్మునినాథుఁడు చూచి నెమ్మిలోన్. 74

వ. ఇగ్గరుడుండు భువనహితమహారంభుండు బలసమన్వితుండు మీకు బాధయగు నని యిత్తరుశాఖ విడువ నేరకున్న వాఁడు వీనిం గరుణించి మీ రొండుకడ కరుగుం డనిన వాలఖిల్యులు కశ్యపుప్రార్థనంజేసి దాని విడిచి హిమవం తంబునకుం జనిరి గరుడుండును ముఖనిక్షిప్తశాఖాస్ఖలిత వచనుం డగుచుఁ దండ్రి కిట్లనియె. 75

క. ధరణీసురవిరహిత మగు
నరణ్యదేశంబు నాకు ౯ స్థానతయిం డి
త్తరుశాఖ విడువవలయును
గరము విరోధ మిది యనినఁ ౯ గశ్యపుఁ డనియెన్. 76

క. హిమశైలకందరాభా
గముకడ నిష్పురుషనగము ౯ గల దచ్చో నీ
ద్రుమశాఖ విడువు మది దా
నమానుష మగమ్య మీశ్వ ౯ రాదులకైనన్. 77

వ. అది యిచ్చటికి లక్షయోజనంబులు గల దరుగు మనిన గరుడుండును మనోవేగంబునం బఱచి యానిష్పురుషనగంబునం దత్తరుశాఖ విడిచి హిమవంతంబుమీఁదికిం బోయి గజకచ్ఛపంబుల భక్షించి మహాసత్త్వసంపన్నుం డై నాకలోకంబున కెగయ సమకట్టి పక్షవిక్షేపంబుఁ జేసిన. 78

క. ఘనపక్షానిలచలితా
వనిరుహములవలనఁ దొరఁగు ౯ వరపుష్పచయం
బనిమిషజయార్థ మరిగెడు
వినతాసుతుమీఁదఁ బుష్ప ౯ వృష్టిం బోలెన్. 79

వ. ఇట్లమృతాహరణార్థంబు గరుడుండు గగనంబున కెగసిన నట దేవలోకంబునందు. 80

మాలిని. సురపతిసభఁ జూడం ౯ జూడ సంగారవృష్టుల్
గురిసెఁ గులిశధారల్ ౯ గుంఠితం బయ్యె దిక్కుల్
జరమధము లడంగెన్ ౯ సర్వదిక్పాలకాంతః
కరణములు భయోద్వే ౯ గంబునన్ సంచలించెన్. 81

వ. ఇట్టిమహోత్పాతంబులు పుట్టిన సురపతి బృహస్పతిం జూచి యిది యేమినిమిత్తం బని యడిగిన దాని నంతయు నెఱింగి బృహస్పతి సురపతి కిట్లనియె. 82

సీ. బ్రహ్మణ్యుఁ డగుకశ్య పబ్రహ్మవరమున
వినతకుఁ బుట్టిన యనఘమూర్తి
వాలఖిల్యులదయ వరపక్షికులమున
కిందుఁడై పరఁగిన యిద్ధతేజుఁ
డుదధిలో నున్నయ త్యుగ్రనిషాదుల
నారంగ మ్రింగిన ఘోరవీరుఁ
డిభకచ్ఛపములరౌ హిణశాఖతో నెత్తి
కొని దివిఁ బఱచిన యనిలవేగి

తే. వీఁగి తనతల్లి దాస్యంబు వీఁగఁబూని
తడయ కమృతంబు గొనిపోవఁ గడఁగివచ్చెఁ
గామరూపసంపన్నుండు గామగమనుఁ
డతఁడు నీకు నసాధ్యుండు శతమఖుండ. 83

వ. అగ్గరుడునిమాహాత్మ్యంబు నీవును నెఱుంగుదు వది యెట్లనినఁ దొల్లి కశ్యపప్రజాపతి పుత్త్రార్థియై భవత్ప్రభృతు లైన దేవగణంబులను వాలఖిల్యప్రముఖు లైన మహామునిగణంబులను దనకు సహాయులనుగాఁ బడసి పుత్త్రకామేష్టి సేయు నాఁడు నీవు నీబలంబునకుం దగిన యిధ్మభారంబు మోచి కొని యశ్రమంబున వచ్చువాఁడవై యల్పకుశపలాశేధ్మ భారంబులు మోచికొని వడవడ వడంకుచు వచ్చువారి

నల్పసత్త్వుల నంగుష్ఠప్రమాణదేహుల ననవరతోపవాస
కృశీభూతశరీరుల వాలఖిల్యమహామునులం జూచి నగిన
నమ్మునులు సిగ్గువడి కడు నలిగి. 84

క. రణవిజయుఁ డనలతేజుం
డణిమాదిగుణాఢ్యుఁ డుదితుఁ డయ్యెడు వీరా
గ్రణి శతమఖుకంటెను శత
గుణవీర్యుం డైనపుత్త్రకుం డజితుండై. 85

వ. వాఁడు రెండవయింద్రుం డయ్యెడు మని మహోగ్రవ్యవం
తంబు లైనమంత్రంబుల వేల్చుచున్నంత నంతయు నెఱింగి
నీవు కశ్యపుపాలికిం బోయి నాకుం గరుణింపుండని నారిం
బ్రార్థించినఁ గశ్యపప్రజాపతి యమ్మునుల కిట్లనియె. 86

ఉ. ఉండు నితండు పద్మజునియోగమునం ద్రిజగంబులందు నిం
ద్రుం డయి భూతరాశిఁ దన దోర్బలశక్తిఁ గడంగి
కాచుచుఁ, రెండవ యింద్రుఁ డైన విపరీత మగుఁ
భువనప్రవృత్తి మీ, రొండువిధంబు సేయు టిది యుక్త
మె బ్రహ్మనియుక్తి యుండఁగన్. 87

వ. మీవచనం బమోఘంబు గావున నింక నాకు నుద్భవిల్లెడు
పుత్త్రుండు పక్షికులంబున కెల్ల నింద్రుండయ్యెడు మని
కశ్యపుండు వారల నొడంబఱిచి నీయింద్రత్వం బేకాంక్షి
తంబు సేసె నట్టి కశ్యపప్రజాపతియజ్ఞమహిమను వాల
ఖిల్యులతపోమహిమను వినతకుం బుట్టి విహగేంద్రుం డైన
యాగరుడుం డిప్పు డమృతహరణార్థం బరుగుదెంచుటం

జేసి స్వర్గలోకంబున మహోత్పాతంబులు పుట్టె నని సుర
పతికి బృహస్పతి సెప్పిన విని యింద్రుం డమృతరక్షకుల
నెల్ల రావించి మీర లతిప్రయత్నంబున నమృతంబు రక్షిం
చుకొని యుండుం డని పంచిన వారలై యని. 88

క. వారలు బహుప్రకారా
కారులు వీరులు నిశాత ఖడ్గాదిమహో
దారుణశస్త్రధరులు క్ర
వ్యారుణసితపీతఘనత రాంగ త్రాణుల్. 89

క. సమకట్టి యొక్కమొగి న
ప్రమాదులై నిలిచి రేయుఁ బవలును రక్షా
క్షములై యమృతముచుట్టును
నమేయబలు లుండి రంత నతిరభసమునన్. 90

మ. వితతోల్కాశనిపుంజ మొక్కొ యనఁగా విస్ఫూర్తి విక్షి
ప్తప। క్షతివాతాహతిఁ దూలి మూలశకలాకారంబు
లై వారిద। ప్రతతుల్ సాల్పడి నల్గడం జెదరఁగాఁ బాత్రా
మనోవేగుఁడై। పతగేంద్రుం డమృతాంతికంబునకుఁ
దత్పాలుర్ భయం బందఁగన్. 91

వ. అంత. 92

— గరుడుఁ డమృతరక్షకులతో యుద్ధము సేయుట. —

క. కల్పాంతానలకీలా
కల్పాయతపక్షుఁ బక్షి గణవిభు శౌర్యా
కల్పుఁ గని యమృతరక్షు ల
నల్పక్రోధు లయి తాఁకి రార్చి కడంకన్. 93

క. తడఁబడ నేసియు వ్రేసియుఁ
బొడిచియు వివిధాస్త్రశస్త్రముల నుద్ధతులై
కడుకొని యుద్ధము సేసిరి
కడిమిమెయిన్ విబుధవరులు గరుడునితోడన్. 94

వ. గరుడుండును నిజపక్షవిక్షిప్తరజోవృష్టి నమరవరులదృష్టిపథంబు గప్పి స్వర్గలోకంబు నిరవలోకంబుగాఁ జేసిన నమరేంద్రుపనుపునం బవనుం డారజోవృష్టి సెదర వీఁచె నంత. 95

మాలిని. పరశు కులిశ కుంత ప్రాస బాణాస నోద్య
త్పరిఘ కణప చక్ర ప్రస్ఫురద్బాహు సేనా
పరివృతుఁ డయి తాఁకెన్ భౌవనుం డన్మహాకిం
కరుఁడు సమరకేళీ గర్వితున్ వైనతేయున్. 96

క. బలవత్తరేంద్రకోపా
నలభస్మీభూతుఁడై క్షణంబున వాఁడున్
బల మఱి కాఁగె నుదగ్ర
జ్వలనజ్వాలావలీఘ శలభము పోలెన్. 97

వ. మఱియును. 98

సీ. పక్షతుండాగ్రనిక్షతదేహులై
బోరన నవరక్తధార లొలుక
విహగేంద్రునకు నోడి నిహతులై సురవరుల్
సురరాజుమఱువుసొచ్చిరి కడంగి.

సాధ్యు లనాయాస ౯ సాధ్యులై పాఱిరి
పూర్వాభిముఖు లయి ౯ గర్వ మడఁగి
వసువులు రుద్రులు ౯ వసుహీనవిప్రుల
క్రియ దక్షిణాశ్రితు ౯ లయిరి భీతి
ఆ. నొంది యపరదిక్కుఁ ౯ బొంది రాదిత్యు లా
శ్వినులు నుత్తరమున ౯ కొనరఁ బఱచి
రనల వరుణ పవన ౯ ధనద యమాసురుల్
పేఁక దఱిఁగి కాంది ౯ శీకు లయిరి. 99

క. తలరఁగ రేణుకధన
ప్రలిహా ప్రరు జాశ్వక్రాంత ౯ పదనఖు లనుర
క్షులఁ గులిశనిశాతనఖా
వలిఁ బక్షీంద్రుండు వచ్చి ౯ వందఱ లాడెన్. 100

వ. ఇట్లు నిర్జరవరుల నెల్ల నిర్జించి యూర్జితుండై గరుడుం
డమృతస్థానంబున కరిగి దానిం బరివేష్టించి ఘోరసమీర
ప్రేరితం బై దుర్వారశిఖాజిహ్వల నంబరంబు నాస్వాదించు
చున్నయనలంబుం గని తత్క్షణంబ సకలనదీజలంబుల నెల్లఁ
బుక్కిలించుకొని వచ్చి యయ్యనలంబు నాఱం జల్లి తీక్ష్ణ
ధారం బై దేవనిర్మితం బై పరిభ్రమించు చున్నయంత్ర
చక్రంబునరాంతరంబున సంక్షిప్తదేహుం డై చొచ్చి
యచ్చక్రంబుక్రింద. 101

ఉ. ఘోరవికారసన్నిహిత ౯ కోపముఖంబులు దీప్తవిద్యుదు
ల్కారుణదారుణాక్షములునై నిజదృష్టివిషాగ్ని నన్యులం

జేరఁగ నీక యేర్చుచుఁ బ్రసిద్ధముగా నమృతంబుచుట్టు ర
క్షారతి నున్నయుగ్రభుజగంబుల రెంటిని గాంచి చెచ్చెరన్.

వ. అయ్యురగంబులం దనపక్షరజోవృష్టి నంధంబులం జేసి వానిశిరంబులు ద్రొక్కి పరాక్రమం బెసంగ నమృతంబు గొని గరుడుండు గగనంబున కెగసిన. 103

క. కలహమున నిట్లు సురవీ
రులఁ బల్వుర నోర్చి యొక్కరుఁడ యమృతముఁ దె
క్కలికొని యాస్వాదింపక
యలోలుఁ డగువానిఁ జూచి హరి యిట్లనియెన్. 104

క. నీవిజయోత్సాహమునకు
లావునకు జవంబునకు నలౌల్యమునకు స
ద్భావమునకు మెచ్చి వరం
బీ వచ్చితి వేఁడు మెద్ది యిష్టము నీకున్. 105

వ. అని ప్రసన్నుండై యాన తిచ్చినయాదిదేవుం డగుశ్రీమన్నారాయణునకు నమస్కరించి గరుడుం డిట్లనియె. 106

సీ. అమృతాశనంబు సేయకయును దేవ నా
కజరామరత్వంబు నందుటయును
నఖిలలోకంబుల కగ్రణి వైననీ
యగ్రంబునందు నిన్నధికభక్తిఁ
గొలుచుచు నునికియుఁ గోరితిఁ గరుణతో
దయసేయు ముద్ధత దైత్యభేది
యనవుడు వానికి నభిమతంబులు ప్రీతుఁ
డై యిచ్చి హరి యిట్టు లనియె నాకు

ఆ. ననఘ వాహనంబ వై మహాధ్వజమవై
యుండుమనినఁ బక్షి యును బ్రసాద
మనుచు మ్రొక్కి పఱచె నంత నాతనిమీఁద
వజ్రి నెత్తివైచె వాసవుండు. 107

వ. అదియును నంబరంబున నగ్నికణంబులు చెదరం బఱతెంచి పక్షిరాజుపక్షంబులు దాఁకవచ్చినం జూచి గరుడుండు నగి నీచేయువేసన నన్నుం దాఁకనోపదు నీవు మహామునిసంభవంబ వగుటను దేవేంద్రునాయుధంబ వగుటను నిన్ను నవమానింపరాదు గావున మదీయైకపర్ణశకలచ్ఛేదంబు సేయుము నాయందు నీశక్తి యింతియ యనిన సకలభూతసంఘం బెల్ల నాతనిపర్ణంబులసుస్థిరత్వంబునకు మెచ్చి సుపర్ణుం డని పొగడిరి సురేంద్రుండును నవ్విహగేంద్రుమాహాత్మ్యంబునకు మెచ్చి యచ్చెరు వంది యి ట్లనియె. 108

—♦ ఇంద్రుఁడు గరుడునిప్రభావంబునకు మెచ్చి స్నేహించుట. ♦—

ఆ. నిరుపమానశౌర్య నీతోడఁ జెలిమి సే
యంగ నా కభీష్ట మైనయదియు
నిట్టివిక్రమంబు నిట్టిసామర్థ్యంబు
గలదె యొరుల కిజ్జగంబునందు. 109

క. అమరుఁడ వజరుఁడ వజితుఁడ
వమేయుఁడవు నీకు నమృత మది యేల ఖగో
త్తమ దీని నొరుల కిచ్చిన
నమరులకును వా రసాధ్యు లగుదురు పోరన్. 110

క. నీ వారులకు నీయమృతం
బీవలవదు నాకు మగుడ నిచ్చిన నీ కి
ష్టావాప్తి యగువిధం బేం
గావించెద ననిన హరికి గరుడుం డనియెన్. 111

వ. ఏను మదీయమాతృదాసీత్వనిరాసార్థం బురగుల కమృతంబు దెచ్చి యిత్తు నని కాద్రవేయులతో నొడివి వచ్చిన వాఁడ నీయమృతంబు గొనిపోయి వారల కిచ్చి మదీయ జననీదాస్యంబు వాపికొనిన నురగు లీయమృతం బుపయోగింపకుండ ముందఱ నీవు గొని చను మనిన నగ్గరుడుని మహానుభావంబునకు మెచ్చి నీబలపరాక్రమంబులు విన వలతుం జెప్పు మనిన నయ్యింద్రునకు గరుడుం డిట్లనియె.

క. పరనిందయు నాత్మగుణో
త్కరపరికీర్తనముఁ జేయఁ గా నుచితమె స
త్పురుషుల కైనను నీక
చ్చెరువుగ నాకల తెలుంగుఁ జెప్పెదఁ బ్రీతిన్. 113

ఉ. స్థావరజంగమప్రవితతం బగుభూవలయంబు నెల్ల నా
లావునఁ బూని తాల్తు నవి లంఘ్యపయోధిజలంబు లెల్లర
త్నావళితోన చల్లుదు బృహన్నిజపక్షసమీరణంబునన్
దేవగణేశ యీక్షణమ తిమ్మరి వత్తుఁ ద్రివిష్టపంబులన్.

వ. అని చెప్పిన గరుడునిజవసత్త్వసామర్థ్యంబులకు మెచ్చి సంతసిల్లి నీవు నాతో నెప్పుడు బద్ధసఖ్యుండ వై యుండ వలయు నని వెండియు దేవేంద్రుండు గరుడున కిట్లనియె.

క. నా కభిమత మొనరించితి
నీ కిష్టము సెప్పికొను మ ననిన దుర్మదు లై
మా కి ట్లహితముఁ జేసిన
యాకద్రువపుత్త్రు లశన మయ్యెడు నాకుఁ. 116

క. భవదభిరక్ష్యము లగునీ
భువనంబులయందు సర్ప ములు ద్రిమ్మరుటన్
దివిజాధిప నీ కెఱిఁగిం
ప వలసె నీయాజ్ఞ నాకుఁ బడయఁగ వలసెన్. 117

వ. అని గరుడుండు దనకు నురగభోజనత్వంబు సురపతిచేతం బడసి తదనుగమ్యమానుం డై యురగులయొద్దకు వచ్చి మరకతహారితం బైనకుశాస్తరణంబున నమృతకలశంబు నిలిపి యురగులకుం జూపి యిట్లనియె. 118

క. అనిమిషనాథసుగుప్త మ
యినయమృతము దెచ్చి మీకు నిచ్చితి నస్మ
జ్జననీదాస్యము వాసెను
దినకరపవనాగ్నితుహిన దీప్తుల కరిగాన్. 119

వ. మీరలు స్నాతాలంకృతుల రై వచ్చి దీని నుపయోగింపుం డని పంచి తల్లిం దనవీఁ పెక్కించుకొని విహగేంద్రుం డురగుల కదృశ్యుం డై యున్న సురేంద్రు వీడ్కొని చనియె నిట నురగులును నమృతోపయోగకుతూహలంబున నొండొరులం గడవఁ గృతస్నానాలంకృతు లై చనుదెంచు టకుముందఱ. 120

క. అమరాధిపుఁ డమృతముఁ గొని
యమరావతి కరిగి కొంటి రయ్యట్టుల సుస్థా
నమున నవిచలితరక్షా
క్షముఁడై రక్షించుకొని సుఖస్థితి నుండెన్. 121

వ. అంత నయ్యురగులు నమృతం బుపయోగింపం గానక దానియున్నస్థానం బని దర్భలు నాకిన నాలుకలు రెండుగా వ్రయ్యుటంజేసి నాఁటంగోలె ద్విజిహ్వులు నాఁబరఁగిరి యమృతస్థితింజేసి దర్భలు పవిత్రంబు లయ్యె. 122

క. ఈసౌపర్ణాఖ్యానము
భాసురముగ వినినపుణ్యపరులకు నధిక
శ్రీసంపద లగు దురితని
రాసం బగుఁ బాయు నురగరక్షోభయముల్. 123

వ. ఇట్లురగు లమృతం బుపయోగింపం గానక చనిన శేషుండు తనతల్లియుం దమ్ములుఁ జేసినయధర్మంబునకు నిర్వేదించి వారల విడిచి కడునిష్ఠతో గంధమాదనబదరీతపోవనగోకర్ణపుష్కరారణ్యహిమవంతంబు లాదిగాఁగల పుణ్యస్థానంబులం దనేకశతసహస్రవర్షంబులు బ్రహ్మ నుద్దేశించి తపంబు సేసిన బ్రహ్మయుఁ బ్రత్యక్షం బై వరంబు వేఁడు మనిన శేషుం డిట్లనియె. 124

— బ్రహ్మయనుజ్ఞవలన శేషుఁడు భూభారంబు దాల్చుట. —

సీ. తల్లియు నాసహోదరులును మూర్ఖులై
ధర్మప్రనుచితంబు దప్పి వినత

కా వైనతేయున కపకారములు సేసి
రిప్పుడు వారు సహింప కెగ్గు
సేయుదు రేను రోసితి వారితోడిపొ
త్తొల్లఁ దపంబు సేయుచు శరీర
భారంబు విడిచెదఁ బరమేష్ఠి యనవుడు
నాతనిసమబుద్ధి కజుఁడు మెచ్చి

ఆ. నిత్యసత్యధర్మ నిరతుండ వఖిలంబు
దాల్ప నోపునట్టి ధైర్యయుతుఁడ
విది యనన్యవిషయ మిమ్మహీభారంబు
నీవ తాల్పవలయు నెమ్మితోడ. 125

చ. వినతకు నాత్మజుం డయిన వీరుఁడు గశ్యపవాలఖిల్యస
న్మునులవరంబు గన్నఖగ ముఖ్యుఁడు వాసవు నోర్చి
యున్నస। ద్వినుతబలుండు గావున వివేకమునన్ విన
తాతనూజుతో। ఘనముగఁ జెల్మి సేయు మిది కార్యము
నీకు భుజంగమేశ్వరా. 126

వ. అని బ్రహ్మ నియోగించిన శేషుం డశేషమహీభారంబు దాల్చి గరుడునితో బద్ధసఖ్యుం డై యుండె నిట వాసుకియుం దల్లిశాపంబున జనమేజయుసర్పయాగంబునం దయ్యెడుసర్పకులప్రళయంబునకు వెఱచి తనబాంధవుల నైరావతాదిసహోదరుల రావించి విషణ్ణహృదయుండై యిట్లనియె. 127

—♦ వాసుకి తల్లిశాపంబునకు వగచుట. ♦—

చ. చిరముగ బ్రహ్మకుం దపము ♦ సేసి యనంతుఁ డనంత ధారుణీ। భరగురుకార్యసక్తుఁ డయి ♦ పన్నగముఖ్యుల పొత్తు వాసి చె। చ్చెరఁ దనయంత నుండి మదిఁ ♦ జేర్చి తలంపఁడ యొక్కనాఁడు దుర్భరతరదందశూకకుల ♦ భావి భయప్రవిఘాతకృత్యముల్. 128

వ. మఱి యమృతమథనంబునాఁడు మందరమహానగంబునకు వేత్రంబ నయిననాక్లేశంబునకు మెచ్చి యమరు లెల్లఁ బితామహుం బ్రార్థించి నాకు నవ్యయత్వంబును సకల భయమోక్షణంబునుంగా వరం బిచ్చి రైనను జననీశాపం బున నురగకులప్రళయం బగుటకు మనోదుఃఖంబు దుస్స హంబై యుండు దాని నుడిగించునుపాయం బెద్ది యేమి సేయువార మని చింతించు చున్నయన్నాగరాజునకు నాగ కుమారు లత్యుద్ధతు లై యి ట్లనిరి. 129

సీ. జనమేజయునిచేయు ♦ సర్పయాగమునకు
విఘ్న మందఱముఁ గా ♦ వింత మతఁడు
ధర్మార్థి గావున ♦ ధారుణీసురుల మై
యడుగుద మీక్రతు ♦ వుడుగు మనియుఁ
గొందఱ మతనికిఁ ♦ గూర్చు మంత్రులము నై
యాక్రతుక్రియఁ జేసి ♦ యిహపరముల
కగుఁ బెక్కుదోషంబు ♦ లని హేతువులు సూపి
యుడిగింత మందఱు ♦ నొక్కమొగిన

ఆ. భక్ష్యభోజ్యలేహ్య ౯ పానీయములమీఁద
సదములోనివిప్రి ౯ జనులమీఁద
వెగడుపడఁగఁ జాటి ౯ వెఱపింత మొజ్జలు
తత్ప్రియోగవిధులు ౯ దప్పి పఱవ. 130

వ. అనిన వారలలోఁ గొందఱు బుద్ధిమంతు లయిన భుజంగ
ముఖ్యు లిట్లనిరి. 131

క. ఇవి మీ కన్నియుఁ జేయఁగ
నవు నని తలఁపకుఁడు భూసు ౯ రాహుతిమంత్రో
ద్భవదారుణదహనశిఖల్
గవిసిన నెద్దియును జేయఁ ౯ గా నెడ గలదే. 132

వ. అనిన విని నాగరాజానుజుం డైన యేలాపుత్త్రుం డిట్లనియె.

ఆ. శాప మిచ్చునాఁడు ౯ జననియుత్సంగంబు
నందు నిద్రవోయి ౯ నట్లయుండి
యమరవరుల కజున ౯ కైన యన్యోన్యసం
భాషణంబు లెఱుక ౯ పడఁగ వింటి. 134

వ. అప్పలుకులు సెప్పెద వినుండు శాపానంతరంబ యమరు
లెల్ల నజున కిట్లని రయ్యా కద్రువ కడు నిర్దయురాలై యిట్టి
యనంతబలవీర్యసంపన్ను లయిన కొడుకులం బడసి వారి
క కారణంబ దారుణం బైన శాపం బిచ్చె మీరును వారిం
పక యుపేక్షించితిరి దీనికిం బ్రతీకారంబు గలదే యనిన
నమరులకుఁ గమలసంభవుం డిట్లనియె. 135

క. క్రూరాకారుల జగదప
కారులఁ బన్నగులఁ దాల్పఁ గా నోపనియి
ద్ధారుణికి హితంబుగ దు
ష్టోరగసంహార మిప్పు డొడఁబడ వలసెన్. 136

వ. మఱియు సకలలోకహితాచారులై ప్రసిద్ధులైననాగముఖ్యుల నెల్ల వాసుకిచెలియలైనజరత్కారువునకు జరత్కారుం డనుమహామునికిం బుట్టెడువాఁ డధికతేజస్వి యాస్తీకుం డనుమహాముని జనమేజయసమారబ్ధసర్పకుల ప్రళయంబువలన రక్షించు నని పితామహుండు దేవతలకుం జెప్పిన తెఱంగు సెప్పిన వాసుకిప్రముఖనాగముఖ్యు లెల్ల సంతసిల్లి యేలాపుత్త్రు నెత్తుకొని సాధువాదంబుల నభినందించిరి వాసుకియు నాఁటంగోలె జరత్కారుమునీంద్రుం డెన్నండు దారపరిగ్రహంబు సేయునో యని తత్సమయసమాగమం బపేక్షించి యుండునంత. 137

— జరత్కారుని చరిత్ర —

క. పరమతపోనిధి యాయా
వరవంశోత్తముఁడు నియమవంతుఁడు లోకో
త్తరుఁడు జరత్కారుఁడు నాఁ
బరఁగినముని బ్రహ్మచర్యపరిపాలకుఁడై. 138

క. ఘోరవ్రతములు సలుపుచు
దారపరిగ్రహము సేయఁ దా నొల్లక సం
సారపునర్భవభీతి న
పారవ్యామోహపాశబంధచ్యుతుఁడై. 139

వ. తపస్స్వాధ్యాయబ్రహ్మచర్యంబులం జేసి ఋషులఋణం
బుల నీఁగుచుఁ బరిభ్రమించువాఁడు వనంబులో నొక్క
పల్వలంబు గని యందు మూషికవిలూనంబయి యొక్క
మూలంబ తక్క యున్నవీరణస్తంబంబు నవలంబించి తల
క్రిందై యాదిత్యకిరణంబు లాహారంబుగా వ్రేలుచున్న
ఋషులం గొందఱం జూచి డాయంబోయి జరత్కారుం
డిట్లనియె. 140

క. కడు నుగ్రము దలక్రిందుగఁ
బడివ్రేలుట యిదియు నొకతపంబొకొ నాకే
ర్పడఁ జెప్పుఁ డీతపం బేఁ
దొడఁగెద ననవుడును నయ్యధోముఖపుర్రిల్. 141

క. అనఘ యిది యేటితప మే
మనుపమదుష్కృతుల మగుట నాధారము లే
కను సంతానచ్ఛేదం
బున వ్రేలెద మధమలోకముల తెరువు సనక. 142

వ. మందభాగ్యుల మయినమావంశంబున జరత్కారుం డను
పాపకర్ముండు పుట్టి దారపరిగ్రహంబు సేయను సంతా
నంబు వడయను నొల్ల కున్నవాఁడే మాతనిపితృపితా
మహులము మాపట్టినయవురుగంటవేళ్ళెల్లం గాలుండు
మూషకవ్యాజంబునం దరతరంబ కొఱికిన నొక్కవేర
తక్కియున్నయది యదియును జరత్కారుం డనపత్యుం
డైనం దెగు నే మధఃపాతుల మగుదు మాతం డపత్యంబు
వడసెనేని నూర్ధ్వగతుల మగుదుము. 143

తే. నీవు మాచుట్టమవుపోలె నెమ్మితోడ
నవహితుండవై మాపల్కు లాదరించి
యాజరత్కారుఁ గని చెప్పు మయ్య వాని
నెఱుఁగుదేని మాపడియెడు నీయవస్థ. 144

వ. అనిన విని జరత్కారుం డతికారుణ్యచిత్తుం డయి యప
త్యార్థం బవశ్యంబు వివాహంబు గావలయునని యెంతయుం
బ్రొద్దు చింతించి తనపితృవర్గంబున కిట్లనియె. 145

క. మీరలు నా పితృదేవత
లారాధ్యుల నేను మీకు నాత్మజుఁడ జర
త్కారుఁ డనువాఁడ ముందఱ
దారపరిగ్రహము సేయఁ దగులదు బుద్ధిన్. 146

క. మి మ్మిట్లు సూచి మీకు హి
తమ్మెట్లగు నట్లుగా ముదంబున దారా
ర్థమ్ము ప్రవర్తింపఁగఁ జి
త్త మ్మిప్పుడు పుట్టె నాకు ధర్మస్థితిమై. 147

వ. అనిన విని యమ్మహామునులు జరత్కారుపల్కులకు సంత
సిల్లి యిట్లనిరి. 148

చ. తగినసుపుత్త్రులం బడసి ధర్మువు దప్పక తమ్మనుత్తముల్
పొగడఁగ మన్మహామతులు పొందుగతుల్ గడుఘోరనిష్ఠ
తోఁ। దగిలి తపంబు సేసియును దక్షిణ లిమ్ముగ నిచ్చి
యజ్ఞముల్। నెగడఁగఁ జేసియుం బడయ నేర రపుత్త్రకు
లైనదుర్మతుల్. 149

—◆ జరత్కారుండు వివాహంబు చేసికొనఁ బూనుట. ◆—

వ. కావున నీవు కృతదారపరిగ్రహుండవై సంతానంబు వడసి మమ్ము నూర్ధ్వగతులం జేయు మనిన జరత్కారుం డట్లని నాకు సనామ యయినదాని వివాహంబుగావలయు నని వారికి నమస్కరించి వీడ్కొని సనామకన్యాన్వేషణపరుండై భూవలయం బెల్లఁ గలయం గుమ్మరి. 150

తరువోజ. అనవరతవ్రతా యాసఖేదమున
నతికృశం బగుచున్న యంగంబునందుఁ
దనరి యేర్పడ సిరల్ వద్దయు ముదిమిఁ
దల వడంకుచునుండు తనపితృవరుల
ఘనముగా నూర్ధ్వాభి గమనులఁ జేయఁ
గడఁగి వివాహంబు గా జరత్కారుఁ
డనఘుండు దనకోర్కి కనురూపమైన
యట్టికన్యకఁ గానఁ డయ్యె మర్త్యమున. 151

వ. ఇట్లు జరత్కారుండు వివాహాపేక్షం బ్రతీక్షించుచున్న వాసుకియుం దనచారులవలన నంతయు నెఱింగి నిజసహోదరి యైనజరత్కారుం దోడ్కొని జరత్కారుమహాముని పాలికిం బోయి యిట్లనియె. 152

శా. ధన్యంబయ్యె భవత్కులం బతికృతార్థం బయ్యె నస్మత్కులం
బన్యోన్యానుగుణాభిధానములఁ జిత్తానంద మొందెన్ వివే
కన్యాయాన్విత భూసురోత్తమ జరత్కారూ జగన్మాన్య యీ
కన్యాభిక్షఁ బరిగ్రహింపుము జరత్కారున్ మదీయానుజన్.

వ. అనిన విని యొడంబడి జరత్కారుండు సనామ యగుటం
జేసి యక్కన్యకను వివాహంబై ప్రథమసమాగమంబునం
దనధర్మపత్నికి సమయంబు సేసె నాకు నీ వెన్నండేని నవ
మానంబు దలంచితి నాఁడ నిన్నుం బాసి పోవుదు నని
నాఁటంగోలె. 154

క. వాలుపయి నడచునట్ల
బ్బాలిక వడవడ వడంకి భయమున నియమా
భీలుఁ డగుపతికిఁ బవళుల్
రేలును నేమఱక పరిచరించుచు నుండెన్. 155

క. అనవరతభక్తిఁ బాయక
తనపతికిం బ్రియము సేసి తద్దయు గర్భం
బనురక్తిఁ దాల్చి యొప్పెను
దినకరగర్భ యగుపూర్వదిక్సతివోలెన్. 156

వ. అక్కోమలి యొక్కనాఁడు దనకుఱువు దలయంపిగాఁ
గృష్ణాజినాస్తరణంబున నిజనాథుండు నిద్రితుండై యున్న
యవసరంబున నాదిత్యుం డస్తగిరిశిఖరాసన్నుం డగుటయు
సంధ్యాసమయోచితక్రియలు నిర్వర్తింపఁ దదాశ్రమవాసు
లైనమునులు గడంగుటం జూచి యాత్మగతంబున. 157

సీ. సంధ్యలం దొనరించు సద్విధుల్ గడచిన
ధర్మలోపం బగుఁ దడయ నేల
బోధింప వైతని భూసురప్రవరుండు
పదరునో బోధింపఁ బడి యవజ్ఞ

దగునె నాకిట్లు నిద్రాభంగ మొనరింప
నని యల్గునో దీని కర్తనేని
నలుక నేఁ బడుదుఁగా కగునె ధర్మక్రియా
లోపంబు హృదయంబులో సహింప

ఆ. నని వినిశ్చితాత్మ యై నిజపతిఁ బ్రబో
ధించె మునియు నిద్ర దేఱి యలిగ
యేల నిద్రఁ జెఱిచి తీవు నాప్రుసు జర
త్కారు విట్టు లనియెఁ గరము నెఱచి. 158

క. ఇనుఁ డస్తమింపఁ బోయిన
ననఘా బోధింప వలసె ననవుడు నామే
ల్కానునంతకు నుండక యినుఁ
డొనరఁగ నస్తాద్రి కేఁగ నోడఁడె చెపుమా. 159

వ. నీవు నా కవమానంబు దలంచితివి నీయొద్ద నుండ నొల్లఁ దొల్లి నీకు నాచేసిన సమయంబు నిట్టిద నీగర్భంబున నున్నవాఁడు సూర్యానలసమప్రభుం డైనపుత్త్రుం డుభయకుల దుఃఖోద్ధరణసమర్థుండు సుమ్ము నీవు వగవక నీయగ్రజు నొద్ద నుండుమని జరత్కారువు నూఱార్చి జరత్కారుండు తపోవనంబునకుం జనియె నిట జరత్కారువును దనయగ్రజుండైనవాసుకియొద్దకు వచ్చి తద్వృత్తాంతం బంతయు నెఱింగించి యుండునంత. 160

క. ఆపూర్ణ తేజుఁ డపగత
పాపుఁ డపాకృతభవాను బంధుఁడు నిజమా

తాపిత్రుపక్షపరిబలభ
యాపహుఁ డాస్తీకుఁ డుదితుఁ డై పెరిఁగెఁ బ్రభన్. 161

తే. చ్యవనుసుతుఁడైనసుమతితోఁ జదివె సకల
వేదవేదాంగములు నిజ విమలబుద్ధి
నెఱిఁగె సకలశాస్త్రంబుల నెల్ల నెందు
నధికసాత్త్వికుఁ డాస్తీకుఁ డనఁగ జనులు. 162

వ. అట జనమేజయుండును దక్షకవిషానలంబునం దనజనకుపం చత్వం బుదంకువలన నెఱింగి మంత్రులం జూచి యిది యేమినిమిత్తంబు దీని సవిస్తరంబుగాఁ జెప్పుండనిన మంత్రు లి ట్లనిరి. 163

—♦ జనమేజయునకుఁ బరీక్షితుశాపకారణంబు మంత్రులు చెప్పుట. ♦—

సీ. అభిమన్యునకు విరా టాత్మజ యైనయు
త్తరకును బుట్టిన ధర్మమూర్తి
కౌరవాన్వయపరి క్షయమున నుదయించి
ప్రథఁ బరీక్షితుఁడు నాఁ బరఁగువాఁడు
ధర్మార్థకామముల్ దప్పక సలుపుచుఁ
బూని భూప్రజ నెల్లఁ బుణ్యచరిత
ననఘుఁ డై రక్షించి యఱువది యేఁడులు
రాజ్యంబు సేసిన రాజవృషభుఁ

ఆ. డధికధర్మమార్గుఁ డైనసీయట్టిస
త్పుత్త్రుఁ బడసి యున్న పుణ్యుఁ డన్య
నాథమకుటమణిగ ణప్రభారంజిత
పాదపంకజుండు భరతనిభుఁడు. 164

వ. భవత్ప్రపితామహుం డైనపాండురాజునుంబోలె మృగయా
సక్తుండై యొక్కనాఁడు మహాగహనంబులఁ బెక్కుమృగం
బుల నెగచి చంపి తనచేత నేటువడి పాఱినమృగంబు
వెంటం దగిలి మహాధనుర్ధరుం డై యజ్ఞమృగంబుపిఱుందం
బఱచు రుద్రుండునుంబోలె. 165

పృథ్వీవృత్తము. అమిత్రమదభేది యొక్కరుండ యమ్మృ
గాన్వేషణ। భ్రమాకులితచిత్తుఁడై తగిలిపాఱుచున్ ముం
దటన్। శమీకుఁ డనువాని నొక్కమునిసత్తమున్ సంతత
క్షమాదమసమన్వితుం గనియెఁ గాననాంతంబునన్ 166

వ. కని మునీంద్రా నాచేత నేటువడి మృగం బమ్ముతోన యిట
వచ్చె నది యెక్కడంబోయె నీ వెఱుంగుదేనిఁ జెప్పు మనిన
నమ్ముని మౌనవ్రతుండు గావునఁ బలుకకున్నం గినిసి తత్స
మీపంబున నపగతప్రాణంబై పడియున్నపాముం దనవింటి
కొప్పున నెత్తి యమ్మునియఱుతం దగులవైచి క్రమ్మఱి
హాస్తిపురంబునకు వచ్చియున్నంత. 167

ఆ. ఆశమీకుపుత్త్రుఁ డంబుజసంభవు
గుఱిచి భక్తితోడ ఘోరతపము
సేయుచున్నసుప్రసిద్ధుండు శృంగి యన్
వాఁడు శృంగిసముఁ డవంధ్యకోపి. 168

క. తనజనకునఱుతఁ బవనా
శనశవముఁ దగిల్చి రాజసమునఁ బరీక్షి
జ్జనపాలుచనుట కృశుఁ డను
మునివలన నెఱింగి కోపమూర్ఛాన్వితుఁడై. 169

వ. శాపజలంబు లెత్తికొని విజనం బైనవిపినస్థానంబున విజి
తేంద్రియుండై మొదవులచన్నులు వత్సంబులు గుడుచు
నప్పు డుద్గతం బగుపయఃఫేనంబ తన కాహారంబుగా
మౌనవ్రతంబునం దపంబుసేయుచున్న మహావృద్ధు మదీయ
జనకు నవమానించిన పరీక్షితుండు నేఁడుమొదలుగా సప్త
దివసంబులలోనఁ దక్షకవిషాగ్నిదగ్ధుం డై యమసదనంబున
కరిగెడు మని శాపం బిచ్చి తండ్రిపాలికిం జని 170

క. ఉరగకళేబర మంసాం
తరమునఁ బడి వ్రేలు చునికిఁ దలఁపక యచల
స్థిరుఁడై పరమధ్యానా
వర తేంద్రియవృత్తి నున్న వాని శమీకుర్.  171

వ. కని యయ్యురగకళేబరంబుఁ బాఱవైచి తత్క్షణంబ ప్రబుద్ధ
నయనుం డైనతండ్రి కభివాదనంబు సేసి బాష్పపూరిత
నయనుం డై శృంగి పరీక్షితు నుద్దేశించి తనచేసిన శాప
స్థితి సెప్పిన విని శమీకుండు గరం బడలి యి ట్లనియె.

క. క్రోధమ తపముం జెఱుచును
గ్రోధమ యణిమాదు లైన గుణములఁ బాపుం
గ్రోధమ ధర్మక్రియలకు
బాధ యగుం గ్రోధి గాఁ దపస్వికిఁ జన్నే.  173

క. క్షమ లేనితపసితపమును
బ్రమత్తుసంపదయు ధర్మ బాహ్యప్రభురా
జ్యము భిన్నకుంభములతో
యములట్టిల యధ్రువంబు లగు నివి యెల్లన్.  174

వ. క్షమ విడిచి నీవు దృష్టాదృష్టవిరుద్ధం బైనక్రోధంబుఁ జేకొని సకలక్షమారక్షకుం డైనపరీక్షితునకుం బరీక్షింపక శాపం బిచ్చి చెట్ట సేసితివి రాజరక్షితు లై కాదె మహామును లతిఘోరతపంబు సేయుచు వేదవిహితధర్మంబుల నడపుచు మహాశక్తిమంతు లై యున్నవా రట్టిరాజుల కపకారంబు సేయునంతకంటె మిక్కిలి పాతకం బొం డెద్ది మఱియు భరతకులపవిత్రుం డైనపరీక్షితు రాజసామాన్యుంగా వగచితే. 175

ఉ. క్షత్రియవంశ్యు లై ధరణిఁ గావఁగఁ బుట్టినవారు బ్రాహ్మణ
క్షత్రియవైశ్యశూద్రు లనఁ గాఁ గలనాలుగు జాతులన్
స్వచారిత్రము దప్పకుండఁగఁ బరీక్షితు కాచినయట్లు
రామమాంధాత్రరఘుక్షితీశులు ముదంబునఁ గాచిరె
యేయుగంబులన్. 176

వ. అతండు మృగయావ్యసనంబున నపరిమితక్షుత్పిపాసాపరిశ్రాంతుం డయి యెఱుంగక నా కవజ్ఞఁ జేసె నేనును దాని సహించితి నమ్మహాత్మునకు నీయిచ్చిన శాపంబుఁ గ్రమ్మఱింప నేర్తేని లగ్గగు ననిన శృంగి యిట్లనియె. 177

క. అలుక మెయి మున్న పలికితి
నలుక నె నా పలుకు తీక్ష్ణమై యింతకు ను
జ్జ్వలదహనాకృతిఁ దక్షకుఁ
దలరఁగఁ బ్రేరేప కేల తా నెడ నుడుగున్. 178

వ. నావచనం బమోఘం బనిన శమీకుండు శోకాకులిత చిత్తుండై తన శిష్యు గౌరముఖుం డనువానిం బిలిచి దీని నంతయుఁ బరీక్షితున కెఱింగించి తక్షకువలనిభయంబు దొలంగునట్టియుపాయంబు సేసికొమ్మని చెప్పి రమ్మనిన వాఁడు నప్పుడ పరీక్షితుపాలికిం జని యిట్లనియె. 179

సీ. అడవిలో నేకాంత మతిఘోరతపమునై
నున్నమాగురులపై నురగశవము
వైచుట విని యల్గి వారితనూజుండు
శృంగి యన్వాఁడు శా ర్పిచ్చునట్టి
శాపంబు నీకిచ్చె సప్తాహములలోన
నాపరీక్షితుఁడు నా యలుకఁ జేసి
తక్షకవిషమున దగ్ధుఁ డయ్యెడు మని
దానికి గురులు సంతాప మంది

ఆ. భూతలేశ నన్నుఁ బుత్తెంచి రిప్పుడు
తద్భయంబు లెల్లఁ దలఁగునట్టి
మంత్రతంత్రవిధు లమర్చి యేమఱకుండు
నది నిరంతరంబు ననియుఁ గఱప. 180

వ. అని చెప్పి గౌరముఖుం డరిగినం బరీక్షితుండు పరిక్షీణహృదయుండై తనచేసినవ్యతిక్రమంబునకు సంతాపించి శమీకు నుపశమనంబునకు మెచ్చి శృంగిశాపంబునకు వెఱచి మంత్రివర్గంబుతో విచారించి యాత్మరక్షయం దప్రమాదుండై.

మ. సకలోర్వీశుఁ డతిప్రయత్నపరుఁడై సర్వక్రియాదక్షత
క్షకకోటుల్ పని సేయఁగా ఘనతరైకస్తంభహర్మ్యంబుఁద
క్షకభీతిన్ రచియింపఁబంచి దృఢరక్షన్ దానిలో నుండెఁబా
యక రాత్రిందివజాగరూకహితభృత్యామాత్య
వర్గంబుతోన్. 182

వ. మఱియు విషాపసంహారంబు లయి మహావీర్యవంతంబు
లయినమంత్రతంత్రంబులు గలిగి యాజ్ఞాసిద్ధు లయిన విష
వైద్యుల నొద్దఁబెట్టుకొని పరీక్షితుం డుండునంత నటఁ దక్ష
కుండు విప్రవచనప్రచోదితుం డయి పరీక్షితునొద్దకు నెవ్వి
ధంబునఁ బోవనగునో యని చింతించుచుండె నటఁ దొల్లి.

—♦ కశ్యపునకుఁ దక్షకుఁడు గోరినధనం బిచ్చి మరల్చుట. ♦—

మధ్యాక్కర. ధరణిఁ జరాచరభూతసంఘంబుఁ దమవిషవహ్ని
నురగంబు లేర్చుచు నునికి కలిగి పయోరుహగర్భుఁ
డురగవిషాపేతజీవసంజీవనోపదేశంబు
గరుణఁ గశ్యపునకు నిచ్చె నఖిలలోకహితంబుపొంటె.

వ. అట్టికశ్యపుం డనుబ్రహ్మర్షి శృంగిశాపంబునఁ బరీక్షితుండు
తక్షకదష్టుం డగు నేఁడు సప్తమదివసం బటె యేను వాని
నపేతజీవు సంజీవితుం జేసి నావిద్యాబలంబు మెఱయుదు
మఱి యదియునుం గాక. 185

తే. ధరణి యెల్లను రక్షించు ధర్మచరితు
నాపరీక్షితు రక్షించి యతనిచేత
నపరిమితధనప్రాప్తుండ నగుదుఁ గీర్తి
యును ధనము ధర్మువును నాకుఁ గొనుట యుఱదె. 186

వ. అని విచారించి హస్తిపురంబునకుం బోవువానిఁ దక్షకుండు వృద్ధవిప్రుండయి వనంబులో నెదురం గని మునీంద్రా యెట వోయె దేమికార్యంబున ననిన వానికిం గశ్యపుం డిట్లనియె. 187

క. తక్షకుఁ డనుపన్నగుఁడు ప
రీక్షితుఁ గఱచునట నేఁ డరిందము నతనిన్
రక్షింపఁగఁ బోయెద శుభ
దక్షిణు నామంత్రతంత్రదాక్షిణ్యమునన్. 188

క. అనిన విని నగుచు వాఁ డి
ట్లనియెను దక్షకుఁడ నేన యశనినిపాతం
బున బ్రదుకఁగ నగు నేనియు
ననఘా మద్విషనిహతులకు గగునే బ్రదుకన్. 189

వ. నీమందులు మంత్రంబులు నాయందు నీకుం బనిసేయవు క్రిమ్మఱి పొమ్ము కాదేని నీవ చూడ నివ్వటవృక్షంబుఁ గఱచి నావిషానలంబున భస్మంబుసేసెద నోపు దేని దీనిని సంజీవితంబుఁ జేయు మని తక్షకుం డావృక్షంబుఁ గఱచిన.

ఆ. అయ్యహీంద్రవిషమహాశనిదగ్ధమై
విపులపత్త్రదీర్ఘవిటపతతుల
గగనమండలంబుఁ గప్పినయవ్వట
తరువు భస్మ మయ్యెఁ దత్క్షణంబ. 191

వ. కశ్యపుండు నాభస్మచయంబు గూడఁదోఁచి తనమంత్ర తంత్రశక్తిం జేసి యెప్పటియట్ల వృక్షంబుగాఁ జేసినం జూచి

తక్షకుం డతివిస్మయం బంది మునీంద్రా నీ విద్యాబలంబున
నిది సంజీవితం బయ్యె నేనియు నతికుపితవిప్రశాపవ్యాపగ
తాయుష్యుం డైనపరీక్షితుండు సంజీవితుండు గానోపండు
వానియిచ్చుధనంబుకంటె నాయం దధికధనంబు గొనిపొ
మ్మనినం గశ్యపుండును దనదివ్యజ్ఞానంబున నట్లకా నెఱింగి
తక్షకుచేత ననంతం బైనయర్థంబు గొని క్రమ్మఱి చనియె
న్నిట్లు విజనం బైనవిపినాంతరంబున నైనయయ్యిరువురవృ
త్తాంతంబు మీ రెట్లెఱింగితి రంటేని వినుము. 192

తే. ఇప్పురంబునబ్రాహ్మణుం డిం ధనార్థ
మేఁగి మున్న యావృక్షంబు నెక్కె దాని
తోన దగ్ధుఁ డై మఱి దాని తోన లబ్ధ
జీవుఁ డైవచ్చి జనులకుం జెప్పె దీని. 193

—♦ తక్షకవిషాగ్నిచేఁ బరీక్షితుండు హర్మ్యంబుతోడ దగ్ధుం డగుట. ♦—

వ. అట్లు కశ్యపుం గ్రమ్మఱించి తక్షకుండు తత్క్షణంబ నాగ
కుమారులం బిలిచి మీరలు విప్రుల రయి సురభికుసుమ
స్వాదువన్యఫలంబులు పలాశపర్ణపుటికలం బెట్టికొని పరీ
క్షితుపాలికిం జని యిం డని పంచి తానును వారితోడన
యదృశ్యరూపుం డయి వచ్చిన. 194

చ. ద్విజవరులం గుమారుల నతిప్రియదర్శను లైనవారి ఋ
గ్యజుషపదక్రమంబులు క్రియర్థి గుణించుచు వచ్చు
వారి న। గ్గజపురవల్లభుండు గని గ్రక్కున డాయఁగఁ బిల్చి
మెచ్చి భా। వజసుభగుండు సేకొని యెవ్వారలు దెచ్చిన
వాని నన్నిటిన్. 195

క. వారల నర్హప్రియస
త్కారులఁ గావించి పుచ్చి కాలనియోగ
ప్రేరితుఁడై యమరేంద్ర
కారుఁడు దద్వన్యఫలజిఘత్సాపేక్షన్. 196

వ. మఱియు. 197

ఉ. సూరెల నున్న మంత్రులను జుట్టములం గడుఁ గూర్చు
మిత్రులన్ । సారబలుండు సూచి ముని శాపదినంబులు
వోవుదెంచె నం । భోరుహమిత్రుఁ డస్తగిరిఁ బొందెడు
నం చొగిఁ దత్ఫలావళుల్ । వారల కెల్లఁ బెట్టి యన
వద్యుఁడు దా నొకపండు సెచ్చెరన్. 198

క. కొని వ్రచ్చుడు లోపల న
ల్లనిక్రిమి యై తోఁచి మఱియు లత్తుకవర్ణం
బునఁ బామై విషవహ్నులు
దనుకఁగఁ గుఱుపీరుఁ గఱచి తక్షకుఁ డరిగెన్. 199

వ. తత్పరిజనంబు లందఱు నశనిపాతంబున బెదరి చెదరినట్లు
గనుకనిం బఱచి రయ్యేకస్తంభహర్మ్యంబును దక్షకవి
షాగ్నిదగ్ధం బయ్యె నట్లు భవజ్జనకుండు పరలోకగతుం
డైనం బురోహితపురస్సరానేకభూసురవరులు యథావిధిం
బరలోకక్రియలు నిర్వర్తించి రంత. 200

— జనమేజయమహారాజు సర్పయాగము సేయుట. —

క. ఆయుష్మంతుఁడ వై ల
క్ష్మీయుత బాల్యంబునంద మీయన్వయరా

జ్యాయత్తమహీభారం
బాయతభుజ నీవు దాల్చి । తభిషిక్తుఁడ వై. 201

ఉ. పెంచితి ధర్మమార్గమునఁ । బ్రీతి యొనర్చుచు ధారుణీప్రజన్
మంచి తనేకయాగముల । మానుగ దక్షిణ లిచ్చి విప్రులన్
నించితి సజ్జనస్తుతుల । నిర్మల మైనయశంబు దిక్కులన్
సంచితపుణ్య సర్వగుణ । సంపద నెవ్వరు నీసమానులే.

ఉ. కాదన కిట్టిపాటియప । కారముఁ దక్షకుఁ డేకవిప్రసం
బోధనఁ జేసి చేసె నృప । పుంగవ నీవు ననేకభూసురా
పాదితసర్పయాగమున । భస్మము సేయుము తక్షకాదికా
కోదరసంహతిన్ హుతవ । హోగ్రసమగ్రశిఖాచయం
బులన్. 203

వ. అనిన విని జనమేజయుండు కోపోద్దీపితచిత్తుం డై సర్ప
యాగంబు సేయ సమకట్టి పురోహితులను ఋత్విజులను
బిలువం బంచి వారల కిట్లనియె. 204

చ. తన విషవహ్ని మజ్జనకుఁ దక్షకుఁ డెట్లు దహించె నట్ల యే
నును సహమిత్రబాంధవజ । నుం డగుతక్షకు నుగ్రహవ్యవా
హనశిఖలన్ దహించి దివి । జాధిపలోకనివాసుఁ డైనమ
జ్జనకున కీయుదంకునకు । సాధుమతంబుగఁ బ్రీతిఁ జేసెదన్.

వ. సర్పయాగం బిట్టిదని శాస్త్రవిధానంబు గలదేనిఁ జెప్పుం
డనిన ఋత్విజు లిట్లనిరి. 206

మత్తకోకిలము. నీతదర్థము గాఁగ దేవవినిర్మితం బిది యన్యు లు
ర్వీతలేశ్వర దీనిఁ జేయరు । వింటి మేము పురాణవి

ఖ్యాత మాద్యము నావుడుఁ విని కౌరవప్రవరుండు సం
జాతనిశ్చయుఁ డయ్యె నప్పుడు సర్పయాగము సేయఁగాఁ

వ. ఇట్లు కృతనిశ్చయుండై జనమేజయుండు కాశిరాజపుత్త్రి
యయినవపుష్టయను మహాదేవి ధర్మపత్నిగా సర్పయాగ
దీక్షితుం డయి శాస్త్రోపదిష్టప్రమాణలక్షణనిపుణశిల్పా
చార్యవినిర్మితంబును యజ్ఞోపకరణానేకద్రవ్యసంభారసం
భృతంబును బ్రభూతధనధాన్యసంపూర్ణంబును స్వస్వ
నియుక్తక్రియారంభసంభ్రమ పరిభ్రమద్బ్రాహ్మణనివహం
బును నయినయజ్ఞాయతనంబున నున్నయారాజునకు నొక్క
వాస్తువిద్యానిపుణుం డైనపౌరాణికుం డిట్లనియె. 208

క. అనఘా యీయజ్ఞము విధి
సనాథబుత్విక్ప్రయోగసంపూర్ణం బ
య్యును గడచన నేరదు నడు
మన యొకఁడు భూసురోత్తమనిమిత్తమునన్. 209

వ. అనిన వానివచనం బవకర్ణించి రాజనియుక్తు లయి చ్యవన
కులవిఖ్యాతుం డైన చండభార్గవుండు హోతగాఁ బింగ
ళుం డధ్వర్యుండుగా శార్ఙ్గరవుండు బ్రహ్మగాఁ గౌత్సుం
డుద్గాతగా వ్యాస వైశంపాయన పైల జైమిని సుమంత
శుక శ్వేతకేతు మార్గ లోద్దాలక మాండవ్య కౌశిక
కౌండిన్య శాండిల్య క్రమఠక కోహలాసిత దేవల నారద
పర్వత మైత్రేయ యాత్రేయ కుండజఠర కాలఘట వాత్స్య
శ్రుతశ్రవో దేవశర్మ శర్మద రోమ శోదంక హారిత రురు

పులోమ సోమశ్రివసు లాదిగాఁ గలమహామునులు సద
స్యులుగా నీలాంబరపరిధానులును ధూమసంరక్తనయను
లును నై యాజ్ఞికు లగ్నిముఖంబు సేసి వేల్వందొడంగిన.

క. ధరణిసురమంత్రిహోమ
స్ఫురణను వివసు లయి భూరిభుజగప్రభు లొం
డొరుఁ బిలుచుచు నధికభయా
తురులై కుండాగ్నులందుఁ దొరఁగిరి పెలుచన్. 211

వ. మఱియుఁ గోటిశ మానస పూర్ణశల పాలహాలీమక పిచ్ఛిల
కౌణప చక్రి కాలవేగ ప్రకాలన హిరణ్యబాహు శరణ
కక్షక కాలదంతకాదు లయినవాసుకికులసంభవులును,
బుచ్ఛాండక మండలక పిండసేక్తృ రసేభ కోచ్ఛిఖ శరభ
భంగ బిల్వతేజో విరోహాణ శిలి శలకర మూక సుకుమార
ప్రవేపన ముద్గర శిశురోమ సురోమ మహాహ న్వాదు
లయినతక్షకకులసంభవులును, బారానత పారిజాత పాండర
హారిణ కృశ విహంగ శరభ మోద ప్రమోద సంహాతాప
నాదు లైన యైరావతకులసంభవులును, నేరక కుండలవేణి
వేణీస్కంధ కుమారక బాహుక శృంగబేర ధూర్తక ప్రాత
రాత కాదు లయినకౌరవ్యకులసంభవులును, శంకుకర్ణ
పిఠరక కుఠార సుఖసేచక పూర్ణాంగద పూర్ణముఖ
ప్రహాస శకుని దర్యమాహార కామఠక సుషేణమాన
సావ్యయ భైరవ ముండ వేదాంగ పిశంగ చోద్రి పారక
వృషభ వేగవత్పిండారక మహాహను రక్తాంగ సర్వసారంగ

సమృద్ధపట వాసక వరాహక వీరణక సుచిత్ర చిత్రవేగిక
పరాశర తరుణక మణిస్కంధారుణ్యాదు లయినధృతరాష్ట్ర
కులసంభవులును నయి యొక్కొక్కమొగి సహస్రాయుత
సంఖ్యలు గలిగి. 212

మ. అతివేగాకులచిత్తులై పడి రుదాత్తాశీవిషాగ్నుల్ సితా
సితపీతారుణవర్ణదేహులు నవాసృగ్రక్తనేత్రుల్ మహో
న్నతు లేక త్రిక పంచ సప్త నవనానామ స్తకుల్ పల్వురు
ద్ధతనాగేంద్రులు బ్రహ్మదండహతి నార్తధ్వానులై
వహ్నిలోన్. 213

క. తపఁబపఁ బడియెడురవమును
బడి కాలెడురవముఁ గాలి పలు దెఱఁగుల వ్రి
స్సెడురవమును దిగ్వలయము
గడుకొని మ్రోయించె నురగకాయోత్థిత మై. 214

వ. అంత. 215

క. తక్షకుఁ డతిభీతుం డై
యాక్షణమున నరిగె సురగణాధిప నన్నున్
రక్షింపుము రక్షింపుము
రక్షింపుము యనుచు నప్పురందరుకడకున్. 216

వ. అప్పురందరుండును దొల్లి కమలజువాక్యంబున వాసుకిప్ర
ముఖసర్పకులముఖ్యులకు సర్పసత్త్రభయంబు లేమి యెఱిం
గినవాఁ డయి నాని నోడకుండు మని చేకొని యుండె
నిట వాసుకియు జనమేజయసమారబ్ధసర్పసత్త్రపరిత్రస్తుం

వ. ద్వియోజనత్రియోజనాయామస్థూలవ్యాళనివహం
బులు నిజవంశభ్రాతృవంశజనితంబు లయినవి జననీవాగ్దం
డపీడితంబు లయి యగ్నికుండంబులం బడుటకు శోకించి
తన చెలియలి జరత్కారువుం జూచి యి ట్లనియె. 217

క. పరిస్రుతఫణిసత్త్రభయ
తరిస్రాత్ములమైనయస్మదాదుల కెల్లన్
స్వస్తి యొనర్పంగ నవసర
మాస్తీకున కయ్యె నిప్పు డంబుజనేత్రా. 218

క. విమలతపోవిభవంబునఁ
గమలజునట్టుండ విగతకల్మషుఁ డాస్తీ
కమహాముని యీతనివచ
నమున మహాహికులరక్షణం బగుఁ జేర్మిన్. 219

వ. బ్రహ్మవచనంబు నిట్టిద కా విని యేలాపుత్త్రుండు మాకుం
జెప్పె జరత్కారు మహామునికి నిన్ను వివాహంబు సేయు
టయు నేతదర్థంబ యింకొక్కనిమేషంబేని నుపేక్షించిన
సకలసర్పపరిక్షయం బగుం గావున నాస్తీకుండు జనమే
జయమహీపాలు పాలికిం బోయి సర్పయాగం బుడిగించి
రక్షింపవలయు ననిన నయ్యగ్రజువచనంబులు విని జర
త్కారువు గొడుకు మొగంబు సూచి భవన్మాతులని యో
గంబు సేయు మనిన నాస్తీకుం డి ట్లనియె. 220

### —♦ ఆస్తీకుండు సర్పయాగంబు నివారించుట ♦—

క. కడవఁబడి మున్ను వహ్నిం
గడుకొని పడినవియకాని కద్రూసుతులం
బడ నీ నింక నవశ్యము
నుడిగింతును సర్పయాగ మొడకుఁ డింకన్. 221

వ. అని యాస్తీకుండు వాసుకిప్రముఖుల నెల్ల నాశ్వాసించి సకలవేదాంగపారగు లయినవిప్రవరులతోడం జని జనమేజయసర్పసత్త్రసదనంబునకుం జనుదెంచి స్వదేహకాంతి సభాంతరం బెల్ల వెలుంగుచుండ స్వస్తివచనపూర్వకంబుగా నిట్లని స్తుతియించె. 222

మ. రజనీనాథకులైకభూషణుఁడ వై రాజర్షి వై ధారుణీ
ప్రజ నెల్లన్ దయతోడ ధర్మచరితంబాలించుచుం బొంటిధ
ర్మజు నాభాగు భగీరథున్ దశరథున్ మాంధాతృరామున్
రఘున్ । విజయుం బోలితి సద్గుణంబుల జగద్విఖ్యాత పారీక్షితా. 223

తరలము. కువలయంబునవారికోరినకోర్కికిం దగ నీవుపాం
డవకులంబు వెలుంగఁ బుట్టి దృఢంబుగా నృపలక్ష్మితో
నవనిరాజ్యభరంబు దాల్చిన యంతనుండి మఖంబులం
దివిరి యిష్టధనంబు లిచ్చుటఁ దృప్తులైరి మహాద్విజుల్.

ఉ. అమ్మనుజేంద్రుఁ డైనసలు యజ్ఞము ధర్మజురాజసూయయ
జ్ఞముఁ బ్రియాగఁ జేసినప్రజాపతియజ్ఞముఁ బాశపాణియ
జ్ఞమ్మును గృష్ణుయజ్ఞము నిశాకరుయజ్ఞము నీమనోజ్ఞయ
జ్ఞమ్మును నొక్కరూప విలసన్మహిమం గురువంశవర్ధనా.

చ. వితతమఖప్రయోగవిధి విత్తము లుత్తమధీయుతుల్ జగ
న్నుతసుమహాతపోధను లనుగ్రహనిగ్రహశక్తియుక్తు లీ
క్రతువున ఋత్విజుల్ కమలగర్భసమానులు పూర్వదిక్పతి
క్రతువునయాజకోత్తములకంటెఁ బ్రసిద్ధులు సర్వవిద్యలన్

శా. విద్వన్ముఖ్యుఁడు ధర్మమూర్తి జగద్విఖ్యాతతేజుండు కృ
ష్ణద్వైపాయనుఁ డేఁగుదెంచి సుతశిష్యబ్రహ్మసంఘంబుతో
సద్వంద్యుండు సదస్యుఁడయ్యె ననినన్ శక్యంబె వర్ణింప సా
క్షాద్విష్ణుండవ నీవు భూపతులలోన్ గౌరవ్యవంశోత్తమా.

ఉ. ఆర్తిహరక్రియాభిరతుఁడై కృతసన్నిధుఁడై ప్రదక్షిణా
వర్తశిఖాగ్రహస్తముల వహ్ని మహాద్విజదివ్యమంత్రని
ర్వర్తితహవ్యముల్ గొనుచు వారిజవైరికులేశ నీకు సం
పూర్తమనోరథంబులును బుణ్యఫలంబులు నిచ్చుచుం
డెడున్. 228

వ. అని జనమేజయు నాతనియజ్ఞమహిమను ఋత్విజులను
సదస్యులను నగ్నిభట్టారకు ననురూపశుభవచనంబులఁ
బ్రస్తుతించిన నాస్తీకున కందఱును బ్రీతులయి రంత జన
మేజయుం డాస్తీకుం జూచి మునీంద్రా నీ కెద్ది యిష్టంబు
దానిన యిత్తు నడుగు మనినఁ గరంబు సంతసిల్లి యాస్తీకుం
డి ట్లనియె. 229

ఉ. మానితసత్యవాక్య యభిమన్యుకులోద్భవ శాంతమన్యుసం
తానుఁడవై దయాభినిరతస్థితి నీవు మదీయబంధుసం
తానమనోజ్వరం బుపరతంబుగ నాకుఁ బ్రియంబుగా మహో
ర్వీనుత సర్పయాగ ముడిగింపుము కావుము సర్పసంహతిన్

చ. అనిన సదస్యు లందఱుఁ బ్రి యంబున నిట్టివిశిష్టవిప్రము
ఖ్యునకు మహాతపోధనున కిం దగు పాత్రున కెవ్వియిచ్చినన్
ఘన మగు నక్షయంబు నగుఁ గావున నీద్విజనాథుకోర్కి వెం
పున వృథ సేయఁగాఁ దగదు భూవలయేశ్వర యిమ్ము నెమ్మితోన్. 231

వ. అని సర్వజనానుమతంబుగా జనమేజయుం డాస్తీకప్రార్థ
నం జేసి సర్పయాగం బుడిగించె నయ్యవసరంబున. 232

మ. అతులోర్వీసురముఖ్యమంత్రహుతమా హాత్మ్యంబునన్
వాసవ। చ్యుతుఁడై ముందర తక్షకుం డురువిషా ర్చుల్
దూల వాత్యారయో। ద్ధతి నుద్ధూతవివర్ధితాయతబృహ
ద్దావాగ్నివోలెన్ విచే। ష్టితుఁడై మేఘపథంబునం దిరుగు
చుం డెన్ విస్మితుల్ గా జనుల్. 233

క. ఆతని నత్యుగ్రానల
పాతోన్ముఖుఁ డైనవానిఁ బడకుండఁగ నో
హో తక్షక క్రమ్మఱు మని
యాతతభయుఁ గ్రమ్మఱించె నాస్తీకుఁ డెదన్. 234

మ. జననీశాపభయప్రపీడితమహా సర్పేంద్రులన్ సర్పయా
గనిమిత్తోద్ధతమృత్యువక్త్రగతులం గా కుండఁగాఁ గాచె
నం। చును నాస్తీకమునీంద్రు నందులసద స్యుల్ సంతసం
బంది బో। రనఁ గీర్తించిరి సంతతస్తుతిపదా రావంబు
రమ్యంబుగన్. 235

క. ఒనర జరత్కారుమునీం
ద్రునకు జరత్కారునకు సుకీర్తున్ హైనమహా
మునివరు నాస్తీకుని ముద
మునఁ దలఁచిన నురగభయము పొందదు జనులన్. 236

వ. మఱియు నయ్యాస్తీకుచరితంబు విన్నవారికి సర్వపాపక్ష
యంబగు ననిన్. 237

క. రాజమహేంద్రికపీంద్రిస
మాజసురత్నాజరాజ మార్తండ ధరి
త్రీజననుతచారిత్రవి
రాజితగుణరత్న రాజ రాజనరేంద్రా. 238

వసంతతిలకవృత్తము. వీరావతార సుకవిస్తుత నిత్యధర్మ
ప్రారంభ శిష్టపరిపాలనసక్తరాజా
నారాయణాఖ్య కరుణారసపూర్ణ వీర
శ్రీరమ్య రాజకులశేఖర విష్ణుమూర్తీ. 239

గద్యము. ఇది సకలసుకవిజనవినుతనన్నయభట్టప్రణీతం బయిన
శ్రీమహాభారతంబునం దాదిపర్వంబున నాగగరుడో
త్పత్తియు సముద్రమథనంబును నమృతసంభవంబును
సౌపర్ణాఖ్యానంబును జనమేజయసర్పయాగంబును నాస్తీకు
చరితంబును నన్నది ద్వితీయాశ్వాసము. 240

శ్రీ

హరిహరహిరణ్యగర్భేభ్యో నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## ఆదిపర్వము - తృతీయాశ్వాసము.

---*---



మచ్ఛళుక్యవంశశి
ఖామణి మనుమార్గ రాజకంఠీరవ గౌ
ర్యామరధరణీధర ధర
ణీమండన ధర్మనిరత నిత్యాభ్యుదయా. 1

### వ్యాసుఁడు జనమేజయునకు భారతకథం దెలుప వైశంపాయను నియోగించుట.

వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె నట్లు జనమే
జయుం డుపసంహృతసర్పసత్త్రుం డయి యథావిధి సం
పూర్ణదక్షిణల ఋత్విజులను సదస్యులనుం బూజించి నా
నాథజనంబునకుఁ గోరినధనంబు లిచ్చి యనేకపురాణపుణ్య
కథాశ్రవణకుతూహలపరుం డగుచు విద్వజ్జనగోష్ఠి నుండి
యొక్కనాఁడు. 2

మ. పరమబ్రహ్మనిధిం బరాశరసుతుం బ్రహ్మర్షిముఖ్యుం
దయాపరుఁ గౌరవ్యపితామహుం జనహితుం బ్రారంభుఁ

కృష్ణాజినాం। బరు నీలాంబుదవర్ణదేహు ననురూపపాంసు
నుదృద్భివా। కరరుక్పింగజటాకలాపు గతరాగద్వేషు
నిర్మత్సరుఁ. 3

వ. వైశంపాయనప్రభృతిశిష్యవర్గంబులతో ననేకమునిగణపరి
వృతుం డయి కనకమణిమయోచ్చాసనంబున నున్న వ్యాస
భట్టారకు నతిభక్తినర్ఘ్యపాద్యాదివిధులం బూజించి వినయ
వినమితశిరస్కుండై నమస్కరించి జనమేజయుం డి ట్లనియె.

సీ. ప్రీతితో మీరును భీష్మాదికురువృద్ధ
రాజులు నుండి భూరాజ్యవిభవ
మొల్ల విభాగించి యిచ్చినం దమతమ
వృత్తుల నుండక వీఁగి పాండు
ధృతరాష్ట్రనందనుల్ ధృతి సెడి వా రేమి
కారణంబునఁ బ్రజాక్షయముగాఁగ
భారతయుద్ధము పారపరాక్రముల్
సేసిరి మీహంపు సేయరైరి

ఆ. యెఱిఁగి యెఱిఁగి వారి నేటికి వారింప
రిట్టిగోత్రకలహ మేల పుట్టె
దీనికలతెఱంగు దెలియంగ నావతి
యింపు నాకు సమ్మ నీందవంద్య. 5

వ. అని యిట్లు పాండవధార్తరాష్ట్రవిభేదకథాశ్రవణకుతూ
హలపరుం డయి యడిగిన జనమేజయునకుం గరుణించి
కృష్ణద్వైపాయనుండు వైశంపాయనమునిం జూచి శ్రీమహా

భారతకథాఖ్యానం బాద్యంతం బితనికి సవిస్తరంబుగాఁ
జెప్పుమని పంచి చనిన. 6

### — భారతమహిమ —

క. జనమేజయుండు విద్వ
జ్జనపరివృతుఁడై సమస్తజనపాలసభా
జనయోగ్యుని వైశంపా
యనమునిఁ బూజించె వినతుఁడై వినువేడ్కన్. 7

వ. ఆవైశంపాయనుండును నఖిలభువనవంద్యుం డయినకృష్ణ
ద్వైపాయనమునీంద్రునకు నమస్కారంబు సేసి విద్వజ్జనం
బులయనుగ్రహంబు వడసి. 8

సీ. కమనీయధర్మార్థకామమోక్షములకు
నత్యంతసాధనం బయినదాని
వేడ్కతోఁ దవిలి తన్ వినుచున్నవారల
కభిమతశుభకరం బయినదాని
రాజుల కఖిలభూరాజ్యాభివృద్ధిని
త్యాభ్యుదయప్రదం బయినదాని
వాఙ్మనఃకాయప్రవర్తితానేకజ
న్మాఘనిబర్హణం బయినదాని

ఆ. సత్యవాక్ప్రబంధ శతసహస్రశ్లోక
సంఖ్య మయినదాని సర్వలోక
పూజ్య మయినదాని బుధనుత వ్యాసమ
హామునిప్రణీత మయినదాని. 9

చ. వినుతపరాక్రముల్ ధృతివివేకులు సత్యసమన్వితుల్
యశోధనులు కృతజ్ఞు లుత్తములు ధర్మపరుల్ శరణా
గతానుకంపను లనఁగాఁ బ్రసిద్ధు లగు భారతవీరుల
సద్గుణానుకీర్తనముల నొప్పుదాని విదితం బగుదాని
సభాంతరంబులన్. 10

శా. ఆయుష్యం బితిహాసవస్తుసముదాయం బైహికాముష్మిక
శ్రేయఃప్రాప్తినిమిత్త ముత్తమసభాసేవ్యంబు లోకా
గమన్యాయైకాంతగృహంబు నాఁ బరఁగి నానావేద
వేదాంతవిద్యాయుక్తం బగుదానిఁ జెప్పఁ దొడఁగెం
దద్భారతాఖ్యానమున్. 11

—♦ పాండవధార్తరాష్ట్రులభేదకారణసంగ్రహము. ♦—

సీ. పాండుకుమారులు పాండుభూపతిపరో
క్షంబున హాస్తిపురంబునందు
ధృతరాష్ట్రునొద్దఁ దత్సుతులతో నొక్కటఁ
బెరుఁగుచు భూసురవరులవలన
వేదంబులును ధనుర్వేదాదివిద్యలుఁ
గఱచుచుఁ గడ లేని యెఱుకఁ దనరు
చున్నఁ దద్విపులగుణోన్నతి సైఁపక
దుర్యోధనుండు దుష్కార్య మెత్తి

ఆ. దుర్ణయమున శకుని కర్ణదుశ్శాసనుల్
గఱపఁ బాండవులకు నెఱయఁ జేయఁ

గడఁగెఁ బాండవులును ౹ గడుధార్మికులు గానఁ
బాఱయురైరి వారి ౹ దురితవిధుల. 12

వ. అది యెట్లనిన నొక్కనాఁడు జలక్రీడాపరిశ్రమవిచేష్టితుం
డయి ప్రమాణకోటిస్థలంబున నిద్రితుం డైనభీమసేను నతి
ఘనలతాపాశబద్ధుం జేసి గంగమడుగునం ద్రోచిన నాతం
డనంతసత్త్వుండు గావునఁ దద్బంధంబు లెల్లఁ దెగ నీల్గి
మీఁదికి నెగసె మఱియొక్కనాఁ డతివ్యాయామఖేదంబున
సుప్తుం డైనవానిసర్వాంగంబులందుఁ గృష్ణసర్పంబులం
బట్టి కఱపించిన నాతండు వజ్రమయదేహుండు గావునఁ
దద్విషదంష్ట్రలు నాటవయ్యె మఱియు నొక్కనాఁడు
భోజనసమయంబున వానికి విషంబు వెట్టిన నతండు దివ్య
పురుషుండు గావునఁ దద్విషం బన్నంబుతోడన జీర్ణంబయ్యె
మఱియు వారల కెల్ల నపాయంబు సేయ సమకట్టె. 13

సీ. వదలక కురుపతి ౹ వారణావతమున
లక్కయిల్ గావించి ౹ యక్కజముగ
నందఱఁ జొన్పి యం ౹ దనలంబు దరికొల్పఁ
బనిచినఁ బాండునం ౹ దను లెఱింగి
విదురోపదిష్టభూ ౹ వివరంబునం దప
క్రాంతు లై బ్రతికి ని ౹ శ్చింతు లయిరి
ధర్మువు నుచితంబుఁ ౹ దప్పనివారల
సదమలాచారుల ౹ నుదితసత్య

ఆ. రతుల నఖలలోక । హితమహారంభుల
భూరిగుణుల నిర్జి । తారివర్గు
లై వెలుంగువారి । దైవంబ రక్షించు
దురితవిధుల నెపుడుఁ । బొరయకుండ. 14

వ. ఇట్లు దుర్యోధనుండు సేయు నపాయంబులవలనం బాయుచుఁ
బాండవులు లాక్షాగృహదాహంబువలన నక్షయులై జననీ
సహితంబుగా వనంబునకుం జనిన నందు భీమసేనుండు
హిడింబాసురుం జంపి వాని చెలియలి హిడింబను వివాహం
బై యేకచక్రపురంబున కేఁగి యందు బకాసురుం జంపి
విప్రులం గాచె మఱి యందఱు విప్రవేషంబున ద్రుపదు
పురంబునకుం జని యందు ద్రౌపదీస్వయంవరంబున
మత్స్యయంత్రం బర్జునుం డశ్రమంబున నురులనేసి సకల
రాజలోకంబు నోడించి ద్రౌపదిం జేకొనిన దాని నేవురు
గురువచనంబున వివాహంబై ద్రుపదుపురంబున నొక్క
సంవత్సరం బున్న నెఱింగి ధృతరాష్ట్రుండు వారి రావించి
వారల కర్ధరాజ్యం బిచ్చి యింద్రప్రస్థపురంబున నుండం
బనిచిన నందుఁ బాండవులు రాజ్యంబు సేయుచున్నంత.

క. ద్వారవతి కేఁగి యర్జునుఁ
డారంగ సుభద్రఁ బెండ్లి । యై వచ్చి మహా
వీరు నభిమన్యుఁ గులవి
స్తారకు సత్పుత్త్రు నతిము । దంబునఁ బడసెన్. 16

న ట్లయ్యయాతి సత్సంగతిం జేసి తానును దౌహిత్రులు
నూర్ధ్వలోకంబునకుం జని రని. 225

క. ఆయతులపుణ్యునకు నన
సూయునకుఁ బరీక్షిదగ్రసుతునకు వైశం
పాయనుఁ డనంతపుణ్యఫ
లాయత్తము గాఁగఁ జెప్పె నని కడుఁ బ్రీతిన్. 226

క. వీరశ్రీవనితాశ్రిత
భూరిస్థిరబాహుదండ బుధనుతసుగుణా
ధార కలియుగపవిత్ర పు
రారాతిపదాబ్జపూజ నాసక్తమతీ. 227

మత్తకోకిలము. దండితాహితవీర సూరినిధాన దానవినోదకో
దండపార్థ పరాక్రమప్రియ ధామ దిక్పరిపూరితా
ఖండపాండుయశోనిధీ పర గండభైరవ వైరివే
దండగండపదారిఘోరత రాసిభాసిభుజార్గళా. 228

గద్యము. ఇది సకలసుకవిజనవినుత నన్నయభట్టప్రణీతం బైన శ్రీమహాభారతమునం దాదిపర్వంబున శ్రీమహాభారత కథాప్రారంభంబును వ్యాసుజన్మంబును దేవదైత్యదానవ ముని యక్ష పక్షి గంధర్వాది నానావిధభూతసంభవంబును దదంశావతారంబును రాజవంశోత్పత్తియు యయాతిచరితంబును నన్నది తృతీయాశ్వాసము.

శ్రీ

హరిహరహిరణ్యగర్భేభ్యో నమః

# శ్రీమదాంధ్రమహాభారతము

## ఆదిపర్వము — చతుర్థాశ్వాసము.

శ్రీలలనాస్తనఘటితవి
శాలోరస్స్థల వివేకశ్రీ చతురాననవా
ణీలీలాస్పద విలస
చ్చాళుక్యాన్వయపయోధిశ్రీ సంపూర్ణశశీ.

### పూరునివంశక్రమము.

వ. అక్కథకుండు శౌనకాది మహామునులకుం జెప్పె నట్లు యయాతికిఁ బుత్త్రుండయినపూరుండు సకలమహీరాజ్యంబు సేయుచు వంశకర్త యయిన వానికిఁ గౌసల్య యనుదానికి జనమేజయుండు పుట్టి రాజై యశ్వమేధత్రయంబుఁ జేసి ప్రఖ్యాతి నొందె నాజనమేజయునకు ననంత యనుదానికిఁ బ్రాచీశుండు పుట్టి పరాక్రమంబున నుదయాచల పర్యంతంబు ప్రాగ్దిగ్విజయంబు సేసి ప్రాచీశుండు నాఁ బరఁగె నట్టిప్రాచీశునకు నశ్మకి యనుదానికి సంయాతి పుట్టె వానికి వరాంగి యనుదానికి నహంయాతి పుట్టె

వానికిం గృతవీర్యపుత్త్రి యైనభానుమతికి సార్వభౌముండు
పుట్టె వానికిఁ గేకయరాజపుత్త్రియైన సునందకు జయత్సే
నుండు పుట్టె వానికి వైదర్భియైన సుశ్రవసకు నవాచీ
నుండు పుట్టె నయ్యవాచీనునకు విదర్భరాజపుత్త్రియైన
మర్యాదకు నరిహుండు పుట్టె వానికి నాంగి యనుదానికి
మహాభౌముండుపుట్టె నామహాభౌమునకుం బ్రసేనజిత్పుత్త్రి
యైన సుపుష్టకు నయుతానీకుండు పుట్టె వానికిం బృథుశ్ర
వసునిపుత్త్రి యైనకామకు నక్రోధనుండు పుట్టె వానికిం
గాళింగి యైనకరంభ యనుదానికి దేవాతిథి పుట్టె వానికి
వైదేహి యయినమర్యాదకు ఋచీకుండు పుట్టె వానికి
నాంగి యైనసుదేవ యనుదానికి ఋక్షుండు పుట్టె ఋక్షు
నకుఁ దక్షకపుత్త్రి యయిన జ్వాలయనుదానికి మతినా
రుండు పుట్టె. 2

క. ఇమ్ముగ సరస్వతీతీ
రమ్మునఁ బండ్రెండువత్స రమ్ములు విధిమా
ర్గమ్మున సద్గుణసముదా
య మ్మెసఁగఁగఁ జేసె సత్త్ర యాగము నిష్ఠన్. 3

క. అతనికి సరస్వతీనది
మతి ననురక్తయయి వాని మానుగఁ దనకుం
బతిఁ జేసికొనియె ధర్మ
స్థితి నయ్యిరువురకుఁ ద్రసుఁడు ధీరుఁడు పుట్టెన్. 4

— దుష్యంతమహారాజు చరిత్రము. —

వ. ఆత్రిసునకుఁ గాళింది యనుదాని కిలిలుండు పుట్టె వానికి రథంతరి యనుదానికి దుష్యంతుండు పుట్టెఁ బుట్టి యనన్యసాధారణగుణయుక్తుండై. 5

క. బాలహరిణములఁ బట్టెడు
లీలను విషమాటవీచ రలిత కేసరిశా
ర్దూలేభశరభములఁ దన
బాలత్వమునంద యెగిచి పట్టుచు మఱియున్. 6

క. ఉర్వీరుహానివహముతోఁ
బర్వతములు వెఱికి యొండు పర్వతములపైఁ
బర్వఁగ వైచుచు యావన
గర్వంబున నొప్పె నుర్విఁ గడు నధికుండై. 7

శా. ఆదుష్యంతుఁ డనంతసత్త్వుఁడు సమస్తాశాంతమాతంగమర్యాదాలంకృతమైనభూవలయమాత్మాయత్తమైయుండఁగా నాదిత్యాంశుసమీరదుర్గమమహాగారణ్యదేశాళితో నాదిక్షత్త్రచరిత్ర నేలె నజితుండై బాహువీర్యంబునన్. 8

క. ఆతనిరాజ్యంబున ను
ర్వీతలము ప్రజాసమృద్ధి వెలసి రుజాశో
కాతంకక్షయశంకా
పేతం బై ధర్మచరితఁ బెరుఁగుచు నుండెన్. 9

వ. అమ్మహీపతి యొక్కనాఁడు మృగయావినోదార్థి యయి యాదిత్యహయంబులకంటె వడి గలవాహంబులు పూనిన

రథం బెక్కి యాజానేయతురంగారూఢు లైనయాశ్వికులు పరివేష్టించి రాఁగ ననంతకుంతశక్తిచాపకృపాణపాణు లయిన వీరభటసహస్రంబులతోఁ జని వనంబులోని మృగంబులం జుట్టి ముట్టి. 10

క. కలయఁగ నార్చును బొబ్బయు
నులివును నవ్విపిన మనుమహోదధిఁ బెలుచం
గలఁచెను దుష్యంతమహా
బలమందరనగము సత్త్వభయజనకం బై. 11

క. సరభసపరిచలితమహా
శరభద్విపరిపువరాహశార్దూల మద
ద్విరదాదిప్రకరభయం
కరవనమధ్యమున నృపతి గడుఁ గడిమి మెయిన్. 12

క. ఓసరిలి పఱచుమృగముల
నేసియు డాసినమృగముల నెగిచి భుజాసిన్
వ్రేసియుఁ జంపెను మృగయా
వ్యాసక్తి నపారఘోరవన్యమృగాలిన్. 13

వ. ఇట్లు పెక్కుమృగంబుల నెగిచి చంపెడు వేడుక నతిదూరంబున కరిగిన నాతనిరథవేగంబు ననుగమింప నోపక యధికక్షుత్పిపాసాపరవశు లయి పదాతు లయ్యయిప్రదేశంబుల విశ్రమించి రంత దుష్యంతుండు కతిపయామాత్యపరిజనపురోహితసహితుం డై కొండొకనేల యరిగి ముందట నొక్కపుణ్యనదీతీరంబున వివిధసురభికుసుమఫలభారవినమ్రతరులతాగుల్మపరిశోభితం బయినయొక్కవనంబు గని.

క. అమరపతిఖాండవమునకు
రమణను వైశ్రవణుచైత్ర । రథమునకు సమా
నముగా దీనిని భూభా
గమునకు రచియించెనొకో । కమలజుఁడు దయన్. 15

వ. అని దానిరమణీయభావంబుఁ బొగడుచుఁ జనుదెంచి యవ్వ
నంబు సొచ్చునప్పుడు. 16

చ. అతిరుచిరాగతుండయిన । యాతనికిన్ హృదయప్రమోద
మూ । తతముగ నవ్వనంబున ల । తాలలనల్ మృదులాని
లాపవ । ర్జితకుసుమాక్షతావళులు । సేసలు వెట్టినయట్టి
రైరి సం । పతదళినీనినాదమృదు । భాషల దీవన లొప్ప
నిచ్చుచున్. 17

వ. మఱియును. 18

క. కాఱడవిఁ బఱచుమృగముల
నూఱడకం దిగిచి డస్సి । యున్నతనిశ్రమం
బాఱఁగ నెడఁ బరితాపము
దీఱఁగఁ బై వీచె నన్న । దీపవనంబుల్. 19

మాలిని. ఏచి తనర్చి తలిర్చినక్రొవ్వుల । ని మ్మగుతావుల జొంప
ములం । బూచినమంచియశోకములన్ సుర । పొన్నలఁ
బొన్నలఁ గేదఁగులం । గాచి బెడంగుగఁ బండిన యాసహకా
రములం గదళీతతులం । జూచుచు వీనుల కింపెసఁగన్
విను । చున్ శుకకోకిలసుస్వరముల్. 20

కవిరాజవిరాజితము. చనిచని ముందట నాజ్యహవిర్ధృతసార
భధూమలతాతతులం బెనఁగినమ్రాఁకులకొమ్మలమీఁద
నపేతలశ్రాంతము లైనను బాయనిమధుపపఙ్క్తికరంబులఁ
జూచి జనాధిపుఁ డంత నెఱింగెఁ దపోవన మిది యల్లదె
దివ్యమునీంద్రనివాసము దా నగు నంచు నెడన్. 21

వ. ఇట్లు హృదయసుఖావహం బగు చున్నయవ్వనంబులోఁ
నరిగి యరిగి యనవరతమహాద్విజపఠ్యమానవేదపదక్రమ
ధ్వనులను నవిచ్ఛిన్నహూయమానాగ్నిహోత్రస్వాహాశ
బ్దంబులను ననేకమునిగణప్రణీత వచనవిషయవిభాగవినిర్ణ
యన్యాయనిపుణవిద్వత్సంభాషణఘోషంబులను బ్రతిపక్ష
దుర్భేదప్రమాణవిచార్యమాణవేదార్థమీమాంసకగోష్ఠీ
వివాదనాదంబులనుం జేసి మ్రోయుచు యజ్ఞప్రయోగ
ప్రవీణు లైన యాజ్ఞికులకును విహితానుష్ఠానాసక్తు లయిన
యనుష్ఠాతలకును నఘకతపోనిరతు లయినమహాతపోధ
నులకును నివాసం బయిన పుణ్యనదీతీరంబునఁ దద్దయు
రమ్యం బయి గంగాతీరంబున నరనారాయణస్థానంబునుం
బోలె జగత్పావనం బగుచున్న కణ్వమహామునియాశ్ర
మంబు గని యందు. 22

సీ. శ్రవణసుఖంబుగా సామగానంబులు
చదివెడుశుకములఁ జదువు దగిలి
కదలక వినుచుండు కరులును గరికర
శీతలచ్ఛాయఁ దచ్ఛీకరాంబు

కణములచల్లని నీ గా డ్పానపడి వానిఁ
జెంది సుఖం బున్న నీ సింహములును
భూసురప్రవరులు నీ భూతబలుల్ దెచ్చి
పెట్టునీవారాన్న నీ పిండతతులు
తే. గడఁగి భక్షింప నొక్కటఁ నీ గలసియాడు
చున్న యెలుకలుఁబిల్లులు నీ నొండుసహజ
వైరివర్గంబులయు సహ నీ వాస మపుడు
సూచి మునిశక్తి కెంతయుఁ నీ జోద్యమంది. 23

వ. ఇక్కాశ్యపుం డైనకణ్వమహామునీంద్రునకు నమస్కరించి వచ్చెద నావచ్చునంతకు నందఱు నిచ్చోటన యుండునది యని. 24

చ. వలయునమాత్యులం దగిననీవారల నుండఁగఁబంచి ధారుణీ
తలవిభుఁ డొక్కరుండ చనినతన్విఁ బయోజదళాయతాక్షి
సం। కులమిళితాళినీలపరి నీకుంచితకోమలకుంతలా శకుం।
తల యనుకన్యకం గనియెనీదన్మునివల్లభుమందిరంబునన్.

వ. అదియును ననంతవిలాసంబున జయంతుఁడపోనిదుష్యంతు నెఱింగి యతిసంభ్రమంబున నాసనార్ఘ్యపాద్యాదివిధులం బూజించి కుశలం బడిగియున్న నక్కన్యకం జూచి దుష్యంతుం డి ట్లనియె. 26

ఉ. క్రిచ్చఱ వేఁట వచ్చి యిటఁ నీ గణ్వమహామునిఁ జూచి
పోవఁగా। వచ్చితి మెందుఁ బోయిరొకో నీ వా రనినన్ విని
యాలతాంగి వా।రిచ్చటనుండి యీక్షణమ నీ యేఁగిరికానకుఁ

బాష్పు దేర మీ। వచ్చు టెఱింగిరేని జనసేవల్లభ వారును
వత్తు రింతకుఁ. 27

వ. వారు వచ్చునంతకు నొక్కముహూర్తం బుండునది యనిన
విని యక్కోమలివినయంబునకు మృదుమధురవచనంబు
లకు సంతసిల్లి దానిం గన్యకఁగా నెఱింగి మనోజరాజ్య
లక్ష్మియుంబోనిదాని సర్వలక్షణలక్షితంబు లయినసర్వావ
యవంబులుం జూచి సంచలితహృదయుం డై నీ వెవ్వరి
కూఁతుర విచిత్రరూపలావణ్యవిలాసవిభ్రమగుణసుందరి విం
దుల కేల వచ్చి తని యడిగిన నది యి ట్లనియె. 28

—♦ శకుంతల దుష్యంతునకుఁ దనజన్మక్రమం బెఱింగించుట ♦—

క. జగతీవల్లభ యే న
త్యగణితధర్మస్వరూపుఁ డని జనములు దగఁ
బొగడఁగ జగదారాధ్యుం
డగుకణ్వమహామునీంద్రు నాత్మజ ననినఁ. 29

చ. ఇది మునికన్య యేని మఱి యేలొకొ యీలలితాంగి
యందు నా। హృదయము దద్దయుం దవిలెనిప్పులుకింకను
నమ్మనేరన। య్యెద విజితేంద్రియుం డనఁగ నిమ్మునిఁ
బాయక వింటి నంచు దా।నిది కలరూ పెఱుంగ నవనీపతి
యుత్సుకుఁ డయ్యె నాత్మలోఁ. 30

వ. ఇట్లు దుష్యంతుం డాశకుంతలజన్మం బెఱుంగ వేఁడి వెండి
యు దాని కి ట్లనియె. 31

తే. ఉత్తమాశ్రమనిష్ఠితుఁ డూర్ధ్వరేతుఁ
డైనకణ్వమహాముని యనఘచరితుఁ

డట్టిముని శేట్లు గూఁతుర । వైతి దీని
నాకు నెఱుఁగంగఁ జెప్పుము । నలిననేత్ర. 32

వ. అని యడిగిన నారాజునకు శకుంతల యి ట్లనియె. 33

క. ఇక్కమలాక్షి శకుంతల
యెక్కడియది దీని జన్మ । మెవ్విధ మని త
మ్మొక్కమునినాథుఁ డడిగిన
నిక్కాశ్యపు లర్థిఁ జెప్పి । రేను వినంగన్. 34

వ. నాజన్మప్రకారంబు మాయయ్య యమ్మునికిం జెప్పినవిధంబు చెప్పెదఁ జిత్తగించి వినుమని యాదుష్యంతునకు శకుంతల యి ట్లనియె. 35

సీ. అనఘుఁడు రాజర్షి । యై తపశ్శక్తిమై
బ్రహ్మర్షిభావంబుఁ । బడసి యున్న
సన్మునీశ్వరుఁడు వి । శ్వామిత్రుఁ డతిఘోర
తపము సేయుచునున్నఁ । దత్తపమున
కెంతయు వెఱచి దే । వేశ్వరుఁ డప్సరో
గణములలో నగ్ర । గణ్య యైన
దాని మేనక యను । ధవళాక్షిఁ బిలిచి వి
శ్వామిత్రుపాలికిఁ । జని తదీయ

ఆ. ఘోరతపము చెఱిచి । కోమలి నా కైన
దేవరాజ్యమహిమఁ । దివిరి నీవు
గావు మనిన నదియుఁ । గడుభయంపడి యమ
రేశ్వరునకు మ్రొక్కి । యిట్టు లనియె. 36

చ. వనజభవప్రభావుఁ డగు ♦ వాని వసిష్ఠు నపత్యశోక మ
న్వననిధిలోన ముంచినయ ♦ వారితసత్త్వుఁడు నిన్నుఁ
దొట్టియిఁ । యనిమిషు లెల్ల వానికి భయంపడు చుండుదు
రట్టియుగ్రకో । పనుకడ కిప్పు డేఁగు మని ♦ పాడియె
యిప్పని నన్నుఁ బంపఁగన్. 37

ఉ. అమ్ముని యల్గి చూచుమను ♦ నాక్షణమాత్రిన గోత్రి
ధారుణీ । ధ్రిమ్ములు వ్రియ్యు నయ్యసుము ♦ దక్కఁగ
నంబుధు లింకు మూఁడులో । కమ్ములు దిర్దిరం దిరుగు ♦
గాడ్పు చలింపఁగ నోడు నుగ్రతం।బమ్మినయట్టికోపపరు ♦
పాలికి భామలు వోవ నోడరే. 38

వ. అయినను నా నేర్చువిధంబున నమ్మునివరుచిత్తంబు మెత్తనయి
చిత్తజాయత్తం బగునట్లుగాఁ జేసెద నని వాసవు వీడ్కొని
మేనక తనకు సుందమలయానిలంబు దోడుగాఁ జనుదెంచి
హిమవత్పర్వతప్రదేశంబునం దపంబు సేయుచున్న విశ్వా
మిత్రతపోవనంబు సొత్తెంచె నంత.

క. చల్లనిదక్షిణమారుత
మల్లన వీతెంచెఁ దగిలి ♦ యాలలనాథ
మ్మిల్లకుసుమాంగరాగస
ముల్లసనసుగంధి యగుచు ♦ మునివరుమీఁదన్ 40

చ. అనిమిషకాంతయున్ నవల ♦ తాంతవిభూషణలీల నల్లన
ల్లన వనకేళిలాలసవి ♦ లాసగతిం జనుదెంచి ముందటం
గనియె మునీశ్వరప్రవరుఁ ♦ గౌశికుఁ గౌశికచిత్తభీతిసం
జననమహాతపశ్చరణ ♦ సంయతచిత్తు నిరస్తచిత్తజున్. 41

క. అంబుజలోచన గని విన
యంబున నమ్మునికి మ్రొక్కి యనురాగముతో
డం బుష్పాపచయవ్యా
జంబున విహరించుచుండె సఖులుం దానున్. 42

చ. అలసత యొప్పఁగాఁ దరుణి యమ్మునివల్లభుమ్రోలనున్న నా
మిళితసుగంధబంధురస మీరవశంబునఁ దూలి చాల పై
వలు వెడలన్ బయల్పడియె వల్గుకుచంబులుఁ గక్షయుగ్మ
మున్ । లలితకృశోదరంబుఁ దర త్రివళీయుతరోమరాజి
యున్. 43

క. అందుఁ దనదృష్టి నాటుడుఁ
గందర్పనిశాతసాయకంబులు పెలుచన్
డెందముఁ గాఁడిన ధృతి సెడి
కంది మునీంద్రుండు దానిఁ గవయం దివిరెన్. 44

వ. మేనకయు విశ్వామిత్రునిష్టంబునకుం దగినకామోపభోగం
బులం బెద్దకాలంబు రమియించిన నయ్యిద్దఱకు నిక్కన్యక
పుట్టిన దీని మాలిని యనునొక్కయేటి పులినతలంబునం
బెట్టి మేనక దేవలోకంబునకుం జనియె విశ్వామిత్రుండును
దపోవనంబునకుం జనియె నంత నమ్మునిప్రభావంబున. 45

ఆ. చెలఁగి లేవ నేడ్చు చిఱుతుక దానిఁ గ్రూ
వ్యాదఘోరమృగము లశనబుద్ధిఁ
బట్టకుండఁ జుట్టు పలఁ గప్పి రక్షించు
కొని శకుంతతతులు గూడియుండె. 46

వ. అంత నేము శిష్యగణంబులతోడ సమిత్కుసుమఫలాహారార్థం బక్కడకుం జని యమ్మాలినీపులినతలంబున శకుంతరక్షిత యై యున్నకూఁతు నత్యంతకాంతిమతి నవనీతలంబున కవతరించినతరుణశశిరేఖయుంబోనిదాని నెత్తికొని వచ్చి శకుంతరక్షిత యగుటంజేసి శకుంతల యనునామం బిడి కరంబు గారవంబునం బెనిచితిమి. 47

మధురాక్కర. తనర జనకుండు నన్నప్రదాతయును భయత్రాత యును ననఁగ నింతులకు ముగ్వురు రాగిన గురువులు వీర లనఘ యుపనేత మఱియు నిరంతరాధ్యాపకుండు ననఁగఁ బురుషున కిద్దేవురనయంబును గురువులు. 48

వ. అనం బరఁగిన శాస్త్రార్థంబున నేము దీనికి భయత్రాతల మగుటంజేసి గురుల మిదియును మాచే నభివర్ధిత యగు టంజేసి మాకు హృదయానందని యైనకూఁతురని కణ్వ మహాముని యమ్మునికిం జెప్పినవిధం బంతయు సవిస్తరం బుగా శకుంతల సెప్పిన విని దుష్యంతుం డాత్మగతంబున.

—♦ దుష్యంతుఁడు శకుంతలను వివాహంబు సేసికొనఁ గోరుట. ♦—

చ. ఇది మునినాథకన్యయని యెంతయు నిస్పృహవృత్తి నున్న నా హృదయము రాజపుత్రి యని యిక్కమలాక్షి నిజాభిజాత్యసంపద నెఱింగించినన్ మదనబాణపరంపర కిప్పుడుండ నాస్పద మయి సంచలించె నళిపాతవికంపితపంకజాకృతిన్.

వ. అనుచు మదనాతురుం డయి దుష్యంతుండు దనయందక్కోమలియనురాగం బుపలక్షించి యిట్లనియె. 51

క. ఈవల్కలాజినములకు
నీవన్యఫలాశనముల కీవిటపకుటీ
రావాసములకు నుచితమె
నీవిలసితరూపకాంతి నిర్మలగుణముల్. 52

ఉ. ఈమునిపల్లె నుండు టిదియేల కరం బనురాగ మొప్పఁగా
భామిని నాకు భార్య వయి భాసురలీల నశేషరాజ్యల
క్ష్మీమహనీయసౌఖ్యములమేలుగ నందు మనింది తేందుపా
దామలతుంగహర్మ్యములహారిహిరణ్మయకుట్టిమంబులన్.

సీ. బ్రాహ్మంబు దైవంబుఁ బరఁగ నార్షంబుఁ బ్రా
జాపత్యమును రాక్ష సంబు నాసు
రంబు గాంధర్వంబు రమణఁ బైశాచంబు
నను నెనిమిదివివా హములయందుఁ
గడుఁ బ్రశస్తములు స త్క్షత్త్రవంశ్యులకు గాం
ధర్వరాక్షసములు ధర్మయుక్తి
నీకును నాకును నెమ్మిఁ బరస్పర
ప్రేమంబు గాముండు పెంపఁ దొడఁగెఁ

ఆ. గాన నెడయుఁ జేయఁ గా నేల గాంధర్వ
విధి వివాహ మగుట వినవె యుక్త
మనిన లజ్జఁ జేసి యవనతవదన యై
యాలతాంగి యిట్టు లనియెఁ బతికి. 54

క. కరుణానిరతులు ధర్మ
స్వరూపు లింతకు మదీయ జనకులు నను దెం

తురు వారు వచ్చి నీ కి
చ్చిరేనిఁ బాణిగ్రహణము సేయుము నన్నుఁ. 55

వ. అనిన దానికి దుష్యంతుం డిట్లనియె. 56

తే. తనకు మఱి తాన చుట్టంబు దాన తనకు
గతియుఁ దన్నిచ్చుచోఁ దాన కర్త యనఁగ
వనజనేత్రి గాంధర్వవివాహ మతిర
హస్యమును సమంత్రకమును నగుచునొప్పు. 57

వ. అని దుష్యంతుండు గాంధర్వవివాహస్వరూపంబు సెప్పి
శకుంతల నొడంబఱిచిన నది యిట్లనియె. 58

చ. నరనుత నీప్రసాదమున నా కుదయించిననందనుఁ మహీ
గురుతరయౌవరాజ్యమునకుం దయతోనభిషిక్తుఁ జేయఁగా
వరము ప్రసన్నబుద్ధి ననవద్యముగా దయసేయు నెమ్మితో
నిరుపమకీర్తి యట్లయిన నీకును నాకును సంగమంబగున్.

వ. అనిన విని శకుంతల కెంతయు సంతోషంబుగా దానికోరి
నవరం బిచ్చి గాంధర్వవివాహంబున నభిమతసుఖంబు లను
భవించి యక్కోమలి వీడ్కొని నిన్నుఁదోడ్కొని రా
నస్మత్ప్రధానవర్గంబుఁ గణ్వమహామునిపాలికిం బుత్తెంచెద
నని యాఱడ నోడివి దుష్యంతుండు నిజపురంబునకుం
జనియె నిట శకుంతలయుఁ దన చేసినదాని మునివరుం డెఱింగి
యలిగెడునో యని వెఱచు చుండె నంత నమ్మహాముని
వనంబుననుండి కందమూలఫలంబులు గొని చనుదెంచి
లలితశృంగారభావంబున లజ్జావనతవదనయు నతిభీతచిత్త

యునై యున్న కూఁతుంజూచి తన దివ్యజ్ఞానంబున నంత వృత్తాంతంబు నెఱింగి క్షత్త్రియులకు గాంధర్వవివాహంబు విధిచోదితంబ యని సంతసిల్లి శకుంతల కిట్లనియె. 60

తే. తల్లి నీకులగోత్రసాంకర్యములకుఁ
దగినపతిఁ గంటి దానికిఁ దగఁగ గర్భ
మయ్యె నీదుగర్భమునవాఁ డఖిలభువన
వహనమహనీయుఁ డగుచక్రవర్తి సుమ్ము. 61

వ. నీధర్మచరితంబునకు మెచ్చితి నీవు గోరినవరం బిచ్చెద వేఁడు మనిన శకుంతలయు నాచిత్తం బెప్పుడు ధర్మువునంద తగిలి యుండును నా కుద్భవిల్లెడుపుత్త్రుండు దీర్ఘాయురైశ్వర్యబలసమన్వితుండును వంశకర్తయుఁ గావలయు ననిన నమ్మహాముని కరుణించి దానికోరినవరం బిచ్చి యథాకాలవిధుల గర్భసంస్కారరక్షణంబులు సేయించి యున్నంత వర్షత్రయంబు సంపూర్ణంబైన శకుంతలకు భరతుం డుదయించి కణ్వనిర్వర్తితజాతకర్మాదిక్రియాకలాపుండయి పెరుఁగుచుఁ గరతలాలంకృతచక్రుండును జక్రవర్తిలక్షణలక్షితుండును సింహసంహననుండును దీర్ఘబాహుండును ననంతజవసత్త్వసంపన్నుండును నై పరఁగుచు. 62

మ. అమితోగ్రాటవిలోనఁ గ్రుమ్మరు వరాహవ్యాళశార్దూల ఖ
డ్గమదేభాదులఁ బట్టితెచ్చి ఘనుఁడై కణ్వాశ్రమోపాంత
భూజములం దోలిన కట్టుచున్బలిమిమై శాకుంతలుండొప్పె వ
న్యమదేభంబుల నెక్కుచుం దగిలి నానాశైశవక్రీడలన్.

వ. ఇట్లు వనంబులోనిసర్వసత్త్వంబులను దన మహాసత్త్వం
బునం జేసి దమియించుచున్న యాతనిం జూచి యాశ్చర్యం
బంది యందఱిమును లెల్ల నాతనికి సర్వదమనుం డనునా
మంబుఁ జేసిరి కణ్వమహామునియు నక్కుమారునుదార
తేజోరూపవిక్రమగుణంబులకు సంతసిల్లి వీఁ డఖిలభువన
యౌవరాజ్యాభిషేకంబునకు సమర్థుం డగు దెంచె నని
విచారించి యొక్కనాఁడు గూఁతున కి ట్లనియె. 64

ఆ. ఎట్టిసాధ్వులకును । బుట్టినయిండ్లను
బెద్దకాల మునికి । తద్ద తగదు
పతులకడన యునికి । సతులకు ధర్మువు
సతుల కేడుగడయుఁ । బతుల చూవె. 65

—♦ కణ్వమహాముని శకుంతలను దుష్యంతుపాలికిం బంపుట. ♦—

వ. కావున నీ విక్కుమారునిం దోడ్కొని నీపతిపాలికి నరుగు
మని మహాతపోధను లైనతనశిష్యులం గొందఱఁ దోడు
వంచిన శకుంతలయు దౌష్యంతిం దోడ్కొని దుష్యంతు
పాలికి వచ్చి సకలసామంతమంత్రిపురోహితప్రధానపౌర
జనపరివృతుం డై యున్నరాజుం గనుంగొని. 66

క. గురునాశ్రమంబునను ము
న్నరుదుగఁ బతివలనఁ గనిన । యనురాగము నా
దరణము ననుగ్రహంబును
గరుణయు సంభ్రమము నపుడు । గానక యెడలోఁ. 67

క. ఎఱుఁగఁడొకో నన్ను నెఱిఁగియు
నెఱుఁగనియ ట్లుండునొక్కొ । యెడ దవ్వగుటన్

మఱచెనొకొ ముగ్ధు లధిపులు
మఱవరె బహుకార్యభారమగ్నులు గారే. 68

చ. తలఁపఁగ నాఁడు వల్కిన విధం బెడఁ దప్పఁగఁ జూచె
నొక్కొ చూ । డ్కులు విరసంబులై కరముక్రూరము లైన
నిమిత్తమేమియో । కలయఁగఁ బల్కరించి రుపకారులునై
రని నమ్మియుండఁగా । వలవదు బుద్ధిమంతులు నవప్రియు
లైనధరాధినాథులన్. 69

వ. అని తలంచి చింతాక్రాంత యై శకుంతల వెండియు
నాత్మగతంబున. 70

క. మఱచినఁ దలఁపింపఁగ నగు
నెఱుఁగనివాఁ డెల్లపాట నెఱిఁగింప నగున్
మఱి యెఱిఁగి యెఱుఁగ నొల్లని
కఱటిం దెలుపంగఁ గమలగర్భునివశమే. 71

వ. అయినను వచ్చి మిన్నక పోవం గాదు కావున నాపూర్వ
వృత్తాంతం బెల్ల నెఱింగించి యే నిక్కుమారుం జూపుద
నని మనంబున నిశ్చయించి శంకుంతల యారాజున కిట్ల
నియె. 72

క. జననాథ వేఁటనెపమునఁ
గొనకొని కణ్వాశ్రమమునకున్ వచ్చి ముదం
బున నందు నాకు నీయి
చ్చినవరము దలంప వలయుఁ జిత్తములోనన్. 73

క. బాలార్క తేజుఁ డగునీ
బాలుఁడు నీకొడుకు వీనిఁ ~ బౌరవకులర
త్నాలంకారు నుదారగు
ణాలయు యువరాజుఁ జేయు ~ మభిషేకముతోన్. 74

వ. అనిన విని దుష్యంతుండు దానినంతయు నెఱింగియు నెఱుం గనివాఁడపోలె నిట్లనియె. 75

క. ఏ నెఱుఁగ నిన్ను నెక్కడి
దానవొ మిన్నకయ యనుచి ~ తంబులు పలుకం
గా నేల యరుగు మంబురు
హానన యెందుండి వచ్చి ~ తందులకు వడిన్. 76

వ. అనిన విని వెలువెల్లనై వెచ్చనూర్చి నిశ్చేష్టితయై కెందమ్మి రేకులవలనం దొరంగు జలకణంబులపోలెఁ గోపారుణిత నయనంబుల బాష్పకణంబులు దొరఁగం దలవాంచి యా రాజుం గటాక్షించుచు హృదయసంతాపంబు దనకుఁ దాన యుపశమించుకొని పెద్దయుం బ్రొద్దు చింతించి శకుంతల యారాజున కిట్లనియె. 77

ఆ. ఏల యెఱుక లేని ~ యితరులయట్ల నీ
వెఱుఁగ ననుచుఁ బలికె ~ దెఱిఁగి యెఱిఁగి
యేన కాని దీని ~ నెఱుఁగ రిం దొరు లని
తప్పఁ బలుక నగునె ~ ధార్మికులకు. 78

చ. విమలయశోనిధీ పురుష ~ వృత్తమెఱుంగుచు నుండుఁజూవె వే
దములును బంచభూతములు ~ ధర్మువు సంధ్యలు నంతరాత్మయున్

యముఁడును జంద్రసూర్యులు నహంబును రాత్రియు నన్మహా
పదార్థము లివియుండఁగా నరుఁడు దక్కొన నేర్చునె తన్ను
మ్రుచ్చిలన్. 79

క. నా యెఱిఁగినట్లు యిన్నియు
నీయిచ్చినవరము ధారుణీవర యెఱుఁగున్
నాయందుఁ దొంటియట్టుల
చేయు మనుగ్రహ మవజ్ఞ సేయం దగునే. 80

క. సతియును గుణవతియుఁ బ్రజా
వతియు ననువ్రతయు నైన వనిత నవజ్ఞా
న్వితదృష్టిఁ జూచునతిదు
ర్మతి కిహముం బరముఁ గలదె మతిఁ బరికింపన్. 81

క. సంతతగృహమేధిఫలం
బంతయుఁ బడయంగ నోపు ననుగుణభార్యా
వంతుం డగువాఁడు క్రియా
వంతుఁడు దాంతుండుఁ బుత్త్రవంతుండు నగున్. 82

వ. మఱియును. 83

సీ. ధర్మార్థకామసాధన కుపకరణంబు
గృహనీతివిద్యకు గృహము విమల
చారిత్రశిక్షకాచార్యకం బన్వయ
స్థితికి మూలంబు సద్గతికి నూఁత
గౌరవంబునకేక కారణం బున్నత
స్థిరగుణమణులకాకరము హృదయ

సంతోషమునకు సం । జనకంబు భార్యయ
చూవె భర్తకు నోంస్లు । గావు ప్రియము

ఆ. లెట్టిఘట్టములను । నెట్టియాపదలను
నెట్టితేజములను । ముట్టఁబడిన
వంతలెల్లఁ బాయు । నింతులఁ బ్రజలను
నోనరఁ జూడఁ గనిన । జనుల కెందు. 84

వ. మఱియు భార్య పురుషునం దర్ధం బగుటం జేసి పురుషునకు ముున్న పరేత యైనపతివ్రత పరలోకంబునం దనపురుషుం గూడఁ దదాగమనంబు ప్రతీక్షించుచుండుఁ బురుషుండు మున్న పరేతుం డైనఁ బదంపడి తానును బరేత యై తనపురుషుం గూడనరుగు నట్టిభార్య నవమానించుట యధర్మంబు మఱియునుం బురుషుండు భార్యయందుఁ బ్రవేశించి గర్భంబునఁ బుత్త్రుం డై తాన యుద్భవిల్లుఁ గావున నఙ్గా దఙ్గా త్సమ్భవసి యనునది యాదిగాఁ గల వేదవచనంబులయందును జనకుండును బుత్త్రుండును నను భేదంబు లేదు. 85

క. విను గార్హపత్య మనున
య్యనలము విహరింపఁబడి త । దాహవనీయం
బన వెలుఁగునట్ల వెలుఁగును
జనకుఁడు దాఁ బుత్త్రుఁ డై ని । జద్యుతితోడన్. 86

క. తాన తననీడ నీళ్లల
లో నేర్పడఁ జూచునట్లు । లోకస్తుత త

తన్నును జనకుండు సూచి మ
హానందముఁ బొందు నతిశ ¶ యప్రీతిమెయిన్. 87

వ. పున్నామ్నో నరకా త్త్రాయత ఇతిపుత్త్రి యనువేదవచ
నంబు గలదు గావునఁ బుణ్యాచారుం డయినపుత్త్రుం డుభ
యపక్షంబులవారి నుద్ధరించుఁ గావున. 88

క. నీపుణ్యతనువువలనన
యీపుత్త్రకుఁ డుద్భవిల్లి ¶ యెంతయు నొప్పెన్
దీపంబువలన నొండొక
దీపము పుట్టించినట్లు ¶ తేజం బెసఁగన్ 89

మ. విపరీతప్రతిభాష లేమిటికి ను ¶ ర్వీనాథ యీపుత్త్రగా
త్త్రపరిష్వంగసుఖంబు సేకొనుము ము ¶ క్తాహారకర్పూరసాం
ద్రపరాగప్రసరంబుఁ జందనముఁ జం ¶ ద్రజ్యోత్స్నయుం బుత్త్రగా
త్త్రపరిష్వంగమునట్లు జీవులకు హృ ¶ ద్యంబే కడుం శీతమే.

క. అనఘుఁడు వంశకరుం డై
పెనుపున నీసుతుఁడు వాజ ¶ పేయంబులు నూ
ఱొనరించు నని సరస్వతి
వినిచె మునులు వినఁగ నాకు ¶ వినువీథి దెసన్. 91

క. భూరిగుణు నిట్టికులని
స్తారకు దారకు నుదార ¶ ధర్మప్రియ ని
ష్కారణము తప్పఁజూడఁగ
సారమతీ చనునె నీకు ¶ సత్యము గలుగన్. 92

చ. నుతజలపూరితంబు లగునూతులు నూటికంటె సూనృత
వ్రత యొక బావి మేలు మఱి బావులు నూటికంటె
నొక్కస। త్క్రతు వది మేలు తత్క్రతుశతంబునకంటె
సుతుండు మేలు త। త్సుతశతకంబుకంటె నొక సూనృత
వాక్యము మేలు సూడఁగన్. 93

క. వెలయంగ నశ్వమేధం
బులు వేయును నొక్కసత్య మును నిరుగడలం
దుల నిడి తూఁపఁగ సత్యము
వలనన ములు సూపు గౌరవంబునపేర్మిన్. 94

తే. సర్వతీర్థాభిగమనంబు సర్వవేద
సమధిగమము సత్యంబుతో సరియుఁ గావ
యెఱుఁగు మెల్లధర్మంబుల కెందుఁ బెద్ద
యండ్రు సత్యంబు ధర్మజ్ఞులైనమునులు. 95

క. కావున సత్యము మిక్కిలి
గా విమలప్రతిభఁ దలఁచి కణ్వాశ్రమసం
భావితసమయస్థితి దయఁ
గావింపుము కొడుకుఁ జూడు కరుణాదృష్టిన్. 96

క. క్షత్త్రియుఁ డైనవిశ్వా
మిత్త్రునకుఁ బవిత్రయైన మేనకకున్ స
త్పుత్త్రి నయి బొంకు వలుకఁగ
ధాత్త్రీతలనాథ యింత ధర్మేతరనే. 97

వ. అనిన శకుంతలపలుకులు సైకొన నొల్లక దుష్యంతుం డి
ట్లనియె. 98

క. ఏ నెట నీ వెట సుతుఁ డెట
యే నెన్నఁడుఁ దొల్లి చూచి యెఱుఁగను నిన్నున్
మానిను లసత్యవచనలు
నా నిట్టు లసత్యభాషణం బుచితంబే. 99

క. పోడవునఁ బ్రాయంబునఁ గడుఁ
గడిఁదిబలంబునను జూడఁగా నసదృశు నీ
కొడుకని యాతని నెంతయు
నెడ మడుగుగఁ జూపఁ దెత్తె యిందఱు నగఁగాన్. 100

వ. ఇట్టిలోకవిరుద్ధంబుల కే మోడుదు మయుక్తంబు లయిన పలుకులు పలుకక నీ యాశ్రమంబునకుం బొమ్మనిన శకుంతల యత్యంతసంతాపితాంతఃకరణ యై. 101

మధ్యాక్కర. తడయక పుట్టిననాఁడ తల్లిచేఁ దండ్రిచే విడువఁ
బడితి నిప్పుడు పతిచేతను విడువఁ బడియెద నొక్క
నుడువులు వేయు నిం కేల యిప్పాటి నోములు దొల్లి
కడఁగి నోఁచితిని గా కేమి యనుచును గండె డెందమున.

వ. ఇట్లు దద్దయు దుఃఖించి విగతాశ యై బోరనఁ దొరఁగు బాష్పజలంబు లందంద యొత్తికొనుచు నింక దైవంబ కాని యొండు శరణంబు లే దని యప్పరమపతివ్రత తనయుం దోడ్కొని క్రమ్మఱి పోవ నున్నయవసరంబున.

చ. గొనకొని వీఁడు నీకును శకుంతలకుం బ్రియనందనుండు సే
కొని భరియింపు మీతని శకుంతల సత్యము వల్కె సాధ్వి స
ద్వినుత మహాపతివ్రత వివేకములో నని దివ్యవాణి దా
వినిచె ధరాధినాథునకు విస్మయమందఁగఁ దత్సభాసదుల్.

వ. ఇట్లెల్లవారలకు నతిహర్షంబుగా శకుంతలపతివ్రతాత్వం
బును సత్యంబును భరతోత్పత్తియుఁ బ్రశంసించువేలుపుల
పలుకు లతివ్యక్తంబు లయి యాకాశంబువలన వీతెంచిన
విని దుష్యంతుండు సభాసదులు విన నిట్లనియె. 105

తే. ఏను నీయింతియునుగాని యెఱుఁగ రన్య
లర్థిఁ గణ్వమహాముని యాశ్రమంబు
నందు గాంధర్వవిధి వివాహమునఁ గరము
నెమ్మిఁ జేసితి దీనిఁ బాణిగ్రహణము. 106

తే. అన్య లెఱుఁగమిఁ జేసి లోకాపవాద
భీతి నెఱిఁగియు నిత్తన్విఁ బ్రీతి దప్పి
యెఱుఁగ నంటిని నిందఱ కిప్పు డెఱుఁగఁ
జెప్పె నాకాశవాణి యచ్చెరువుగాఁగ. 107

వ. అని మహానురాగంబునం గొడుకు నెత్తికొని హర్షపులక
లెసఁగ నాలింగనంబు సేసి శకుంతలామహాదేవి నతిప్రణయ
గౌరవంబున సంభావించి యౌవరాజ్యంబునకు భరతు
నభిషిక్తుం జేసి పెద్దకాలంబు రాజ్యసుఖంబు లనుభవించి
తనరాజ్యభారం బంతయు భరతుం బూన్చి దుష్యంతుండు
తపోవనంబున కరిగిన. 108

చ. భరతుఁ డశేషభూభువనభారధురంధరుఁ డై వసుంధరం
బరఁగి యనేకయాగములఁ బాయక భాస్కరజహ్నుకన్యకా
సురుచిరతీరదేశముల సువ్రతుఁ డై యొనరించి భూరిభూ
సురులకు నిచ్చె దక్షిణలు శుద్ధసువర్ణగవాశ్వహస్తులన్.

వ. మఱియు నతీతానాగతు లైననిజవంశంబునరాజుల కెల్ల వంశకర్త యయ్యె నట్టి భరతునకుఁ గైకేయి యైనసునందకు హుతమన్యుండు పుట్టె వానికి దాశార్హపుత్త్రి యైన విజయకు సుహోత్రుండు పుట్టె వానికి నిక్ష్వాకుకన్య యైన సువర్ణకు హస్తి పుట్టె నతనిపేరం గౌరవ్యరాజధాని యైన నగరంబు హస్తిపురంబు నాఁ బరఁగె నట్టిహస్తికిం ద్రిగర్త రాజపుత్త్రి యైనయశోధరకు వికుంఠనుండు పుట్టె వానికి దాశార్హపుత్త్రి యైనవసుదేవికి నజమీఢుండు పుట్టె నయ్యజమీఢునకుఁ గైకేయియు గాంధారియు ఋక్షయు నను మువ్వురు స్త్రీలకు. 110

క. బలయుతులు నూటయిరువది
నలువురు సుతు లుద్భవిల్లి నానాదేశం
బులకుఁ బతు లైరి మఱి వా
రలలోఁ సంవరణుఁ డఖిల రాజోన్నతుఁ డై. 111

క. అలఘుఁడు పౌరవకులవ
ర్ధనుఁ డద్దినకాథతనయఁ దపతి వివాహం
బౌనరంగ నయ్యె నిరువుర
కును వంశకరుండు పుట్టెఁ గురుఁ డున్నతుఁ డై. 112

వ. వానిపేరం గురుక్షేత్రంబు నాఁ బరఁగె నట్టికురునకు (దాశార్హ యైనశుభాంగికిని విదూరథుండు పుట్టె వానికి మాధవియయినసంప్రియకు ననశ్వుండు పుట్టె నయ్యనశ్వునకు) మాగధి యైన యమృతకుం బరీక్షితుండు పుట్టె

వానికి బహుదానసుతయయినసుయశకు భీమసేనుండు పుట్టె వానికిం గైకేయి యైనకుమారికిఁ బ్రతిశ్రవసుండు పుట్టె వానికిఁ బ్రతీపుఁడు పుట్టెఁ బ్రతీపునకు శిబిపుత్త్రి యైన సునందకు దేవాపి శంతను బాహ్లికు లనఁగా మువ్వురు పుట్టి రందు దేవాపి బాల్యంబునంద తపోవనంబున కరిగిన శంతనుండు రాజయ్యె వానికి గంగాదేవికి దేవవ్రతుం డైనభీష్ముండు పుట్టె మఱి యాశంతనునకు యోజనగంధి యైనసత్యవతికిం జిత్రాంగదవిచిత్రవీర్యు లనంగా నిద్దఱు గొడుకులు పుట్టి రందుఁ జిత్రాంగదుండు బాల్యంబున గంధర్వనిహతుం డయిన వానికిం గొండుక వాని విచిత్రవీర్యు రాజ్యాభిషిక్తుం జేసి భీష్ముండు కాశీరాజదుహితల నంబికాం బాలిక లనువారి నిద్దఱ విచిత్రవీర్యునకు వివాహంబు సేసిన.

చ. అతిశయరూపయౌవన గుణాధికసుందర మైన యాసతీ
ద్వితయమునందు సంతతరతిన్ వివశుం డయి రాజకృత్య
ముల్ । మతి నొకనాఁడుఁ జేయక హిమద్యుతితేజుఁడు
రాజయక్ష్మబా । ధితుఁ డయి దేవలోకసుగతిప్రియుఁ
డయ్యె విచిత్రవీర్యుఁడున్. 114

వ. అంత దాష్యంతిసంతానవిచ్ఛేదంబు గావచ్చిన సత్యవతి నియుక్తుం డయి సకలధర్మమూర్తి కృష్ణద్వైపాయనుండు దేవరన్యాయంబున నంబికయందు ధృతరాష్ట్రుని నంబాలిక యందుఁ బాండురాజును నంబికాపరిచారికయందు విదురు నిం బుట్టించిన నందు ధృతరాష్ట్రునకు గాంధారికి వ్యాస

వరప్రసాదంబున దుర్యోధనుం డాదిగా నూర్వురు గొడుకులు పుట్టిరి పాండురాజుని యోగంబునఁ గుంతీమాద్రులకు ధర్మానిలశక్రాశ్వినుల ప్రసాదంబున ధర్మజభీమార్జుననకుల సహదేవు లనంగా నేవురు గొడుకులు పుట్టి రయ్యేవురకుం బాంచాలి ధర్మపత్ని యయ్యె దానియందు ధర్మరాజునకుఁ బ్రతివింధ్యుండును భీమసేనునకు శ్రుతసోముండును నర్జునునకు శ్రుతకీర్తియు నకులునకు శతానీకుండును సహదేవునకు శ్రుతసేనుండును నన నేవురు ద్రౌపదేయులు పుట్టిరి మఱి ధర్మజునకు స్వయంవరలబ్ధ యైన దేవిక యనుదానికి యౌధేయుండు పుట్టె భీమసేనునకు జలంధరకు సర్వగుండు పుట్టె నర్జునునకు సుభద్రకు నభిమన్యుండు పుట్టె నకులునకుఁ జైద్యయయినకరేణుమతికి నిరమిత్రుండు పుట్టె సహదేవునకు స్వయంవరలబ్ధ యైనవిజయకు సుహోత్రుండు పుట్టె మఱియు భీమసేనునకు హిడింబకు ఘటోత్కచుండు పుట్టె నిట్లు పాండవపుత్రు లైనపదునొకండ్రయందును వంశకరుం డైనయభిమన్యునకు విరాటపుత్రియయిన యుత్తరకుం బరీక్షితుండు పుట్టె. 115

క. అతనికి ననంతపుణ్యా
న్వితయనఁ దగుమాద్రవతికి నీ నఖిలజగ
న్నుత జనమేజయ పుట్టితి
ధృతిఁ బాండవవంశమునకుఁ దేజం బెసఁగన్. 116

వ. మఱియు నీకును వపుష్టమకును శతానీకశంకుకర్ణులు పుట్టి రందు శతానీకునకు వైదేహికి నశ్వమేధదత్తుండు పుట్టె.

క. వీ రైలులుఁ బౌరవులును
భారతులును గౌరవులును బాండవులు ననన్
వీరు లయి పరఁగి రిది నయ
పారగ భవదీయవంశపరిపాటి నియ్యెడన్. 118

వ. అనిన విని జనమేజయుండు వైశంపాయనున కి ట్లనియె.

క. నరవరుఁ డగుశంతనునక
మరనదికిని నెట్టు సంగమం బయ్యె మహా
పురుషుండు భీష్ముఁ డెట్లు
య్యిరువురకును బుట్టె దీని నెఱిఁగింపు మొగిన్. 120

వ. మఱి పాండవధార్తరాష్ట్రసంభవంబును సవిస్తరముగా విన వలతుం జెప్పుమనిన వానికి వైశంపాయనుం డిట్లని చెప్పెఁ దొల్లి యిక్ష్వాకువంశంబున మహాభిషుం డనువాఁడు పుట్టి మహాధర్మశీలుం డై యశ్వమేధసహస్రంబును రాజసూయ శతంబునుం జేసి యింద్రాది దేవతలం దనిపి దేవలోకంబు నకుం జని యందు దేవర్షిగణంబులతోఁ బితామహుం గొల్చుచున్నయవసరంబున గంగాదేవి స్త్రీరూపధారిణి యయి బ్రహ్మసభకు వచ్చిన. 121

తే. ఊరుమూల మేర్పడఁగ నయ్యువిదవలువ
దొలఁగ ననిలంబుచేత విధూత మగుచు
నమరు లెల్లఁ బరాఙ్ముఖు లైరి దాని
సాభిలాషుఁ డై చూచె మహాభిషుండు. 122

ఆ. దాని నెఱిఁగి కమల । యోని వానికిఁ గర
మర్థి మర్త్యయోని । యందుఁ బుట్టు
మనుచు శాపమిచ్చె । నొనరంగ వాఁడును
గరముభీతిఁ గరయు । గంబు మొగిచి. 123

వ. మర్త్యలోకంబున రాజర్షి వంశంబులలోనఁ బుణ్యచరిత్రుండు ప్రతీపుండ కావున వానికిం బుత్త్రుండనై జన్మించెద నొరుల యందు జనింప నోప నని కమలభవు ననుమతంబు వడసె గంగయు నమ్మహాభిషునిమహానుభావంబును రూపసౌంద ర్యంబులును దనయందలియభిలాషయు నెఱింగి తానును మనోజబాణబాధితయయి వానిన తలంచుచు మర్త్య లోకంబునకు వచ్చునది యెదుర. 124

క. అనిమిషలోకవియోగం
బున దుఃఖితు లయి వసిష్ఠ । మునివరుశాపం
బున వచ్చువారి వసువుల
నెనమండ్రం గాంచి గంగ । యొంతయుఁ బ్రీతిన్. 125

క. ద్యుతి దఱిఁగి నిజనియోగ
చ్యుతిఁ బొందను మీకు నొందు । చోటికి నరుగం
గత మేమి యనిన విని య
య్యతివకు సురనదికి నిట్టు । లని రవ్వసువుల్. 126

వ. ఏము వసిష్ఠమునివరుశాపంబునం జేసి మర్త్యలోకంబునం దెయ్యేనియునొక్క స్త్రీయందు జన్మింపం బోయెద మని దుఃఖించి తమశాపప్రకారంబు గంగాదేవికి నెఱిఁగించి యే మొందుచోట జన్మింపనోపము నీయందుఁబుట్టెదము మఱి

మహాభిషుండు ప్రతీపునకు శంతనుం డై పుట్టెడుఁ గావున
వానికి నీకును సమాగమంబగు మాజన్మంబునకు నిమిత్తం
బాతండ యగు ననిన విని గంగ సంతసిల్లి యి ట్లనియె.

క. నా కభిమతంబు నిట్టిద
మీకును నుపకార మగు స ॥ మీహితబుద్ధిం
జేకొని చేసెద మీర ల
శోకస్థితి నుండుఁ డనుచు ॥ సురనది కరుణన్. 128

వ. వసువులకు మనఃప్రియంబుగాఁ బలికిన విని వారును గంగ
యనుగ్రహంబు వడసి నీవు మాకు నుపకారంబు సేయ
నోపుదేని నేము నీకుఁ గ్రమక్రమంబునం బుట్టు నప్పుడ
మమ్ము నీళ్ళవైచుచు మర్త్యలోకంబునం బెద్దకాలం బుండ
కుండునట్లుగాఁ జేయునది మాకు వసిష్ఠమహామునియను
జ్ఞయు నిట్టిద యనిన గంగయు నట్ల చేయుదు మఱి మీ
రెల్ల స్వర్గతు లైన నాకొక్కకొడుకు దీర్ఘాయుష్మంతుం
డయి యుండెడువిధం బె ట్లనిన దానికి వసువు లి ట్లనిరి.

క. మాయం దొక్కొక్కళ్ళతు
రీయార్ధముఁ దాల్చి శుభచ ॥ రిత్రుం డై దీ
ర్ఘాయుష్యుం డష్టమవసు
వాయతభుజుఁ డుండు నీకు ॥ నాత్మోద్భవుఁ డై. 130

వ. అని యిట్లు గంగావసువు లొండొరులు సమయంబు సేసి
కొని చని రంత నిక్కడ. 131

క. వీరుఁడు ప్రతీపుఁ డఖిల
క్ష్మారాజ్యసుఖములఁ దనిసి ॥ మానుగ గంగా

తీరమునఁ దపము సేయుచు
భారతకులుఁ డుండెఁ ధర్మ పరుఁ డై నిష్ఠఁ. 132

వ. ఇట్లు యమనియమవ్రతపరాయణుండై యున్నవానికిం బ్రత్యక్షంబై యొక్కనాఁడు. 133

ఉ. గంగ నిజాంగదీప్తు లెసఁగంగం జనుదెంచి లతాంగి సంతతో
త్తుంగపయోధరద్వితయ తోయరుహాయతచారునేత్ర ది
వ్యాంగన యై ప్రతీపవసుధాధిపుశాలవిశాలదక్షిణో
త్సంగమునందు మన్మథవశంబున నుండెఁ గరంబులీలతోఁ.

వ. ప్రతీపుండును దానిం జూచి యచ్చెరు వంది నీ వెందుల దాన వి ట్లేల నాకుఱు వెక్కి తనిన నది యిట్లనియె. 135

ఆ. ఏను జహ్నుకన్య నింద్రసమాన నీ
సద్గుణావళులకు సంతసిల్లి
భానుతేజ నీకు భార్యగా వచ్చితి
నిష్టమునఁ బరిగ్రహింపు నన్ను. 136

చ. అనినఁ బ్రతీపుఁ డిట్లనియె నంబురుహానన యగ్నిసాక్షికం
బునఁ బరిణీత యైనసతిఁ బోల్పుగ నొక్కతెఁ గాని యన్యలన్
మనమున నేనియుం దలఁప మానిని యిట్టిజితాత్ము నన్ను ని
ట్లని పలుకంగ నీ కగు నె యన్యులఁ బల్కినయట్ల బేల వై.

వ. మఱి యదియునుం గాక స్త్రీభాగం బయినడాపలికుఱు వెక్కక పురుషభాగం బయి పుత్త్రారోహణయోగ్యం బయిననావలపలికుఱు వెక్కితి గావున నాపుత్త్రునకు భార్య వగు మనిన నదియు నట్ల చేయుదు నని యదృశ్యయయ్యె

నంతం బ్రతీపుఁడును బుత్త్రార్థి యయి సకలతీర్థంబుల యందు సునందాదేవియుం దానును వేదవిహితవ్రతంబులు సలుపుచుఁ బెద్దకాలంబు దపంబు సేసిన. 138

ఆ. అధికపుణ్యమూర్తు లైన యయ్యిరువుర
కమరనిభుఁడు కౌర వాన్వయంబు
వెలుఁగుచుండఁ బుట్టె వీరాగ్రగణ్యుండు
సంతతార్థదాయి శంతనుండు. 139

వ. ఇట్లుదయించి పెరిఁగి సంప్రాప్తయౌవనుం డయిన కొడుకుం జూచి ప్రతీపుండు తనకు నక్షయపుణ్యలోకంబులు గలిగె నని సంతసించి సకలరాజ్యభారధౌరేయుఁగా నభిషిక్తుం జేసి కొడుకున కిట్లనియె. 140

మధ్యాక్కర. తనుమధ్య దా నొక్కకన్యక సురనదీతటమ్మున
నన్నుఁ। గనిన నక్కన్యకఁ జూచి నీ విట్టి కమనీయరూప।
వొనర నాసుతునకు భార్య వగుమన్న నొడఁబడి యాదు
ననియెఁ గావునను దానిఁ దగ వివాహ మగుము
నెయ్యమున. 141

వ. మఱి యక్కోమలి కులగోత్రనామంబు లడుగక దానియిష్టంబు సలుపు మని కొడుకుం బంచి ప్రతీపుఁడు తపోవనంబునకుం జనియె నిట శంతనుండు రాజ్యంబు సేయుచు నొక్కనాఁడు మహాధనుర్ధరుం డయి మృగయావినోదంబులఁ దగిలి యొక్కరుండును వనములోఁ గ్రుమ్మరువాఁ డనిలాలోలకల్లోలమాలాస్ఫాలనసముచ్ఛలజ్జలకణాసారశిశిరశిశిరం బగు చున్న గంగాపులినతలంబున. 142

క. తరళాయతలోచన న
త్యురుకుచఁ దేజోభిరామ నుత్తమదివ్యాం
బరమాల్యమణిమయాలం
కరణోజ్జ్వలవేష నొక్క కన్యకఁ గనియెన్. 143

చ. కని వనకన్యయో దనుజ కన్యకయో భుజగేంద్రకన్య
యో। యనిమిషకన్యయో యిది వి యచ్చరకన్యకయో
యపూర్వ మీ। వనమున కిట్లు లేకతమ వచ్చునె మా
నవకన్య యంచు న। య్యనఘుఁడు దానిఁ జిత్తమున నా
దట వోవక చూచెఁ బ్రీతితోన్. 144

వ. అదియు నమ్మహీపతిరూపయౌవనసౌందర్యవిలాసంబుల
కోటువడి మహానురాగంబున వానిన చూచు చున్నంత.

క. ఇరువురు నొండొరువులఁ గడు
సురుచిరముగఁ జూచువాఁడి చూడ్కులు దనకున్
శరములుగాఁ గొని యేసెను
మరుఁ డయ్యిరువుర మనోభి మానచ్యుతిగాన్. 146

వ. శంతనుండు దానిం జూచి నీ వెందులదాన వి ట్లేల యేక
తంబ యున్నదాన వనియడుగ నోడి మిన్నక యున్న
నాతండు తనయందు దృఢానురాగుం డగుట యెఱింగి
యది యిట్లనియె. 147

క. భూనాథ నీకు భార్యం
గా నన్నుఁ బరిగ్రహింపఁ గడుకొని యిష్టం
బేని సమయంబు సేయుము
మానుగ నా కిష్ట మయిన మార్గముఁ బ్రీతిన్. 148

—♦ గంగాశంతనులసమయము. ♦—

వ. అది యెట్లంటేని నే నెద్ది సేసినను దానికి నోడంబడి
వారింప కుండను నన్ను నప్రియంబులు వలుకక యుండను
వలయు న ట్లైన నీకు భార్య నై యభిమతసుఖంబు లొన
రింతు నట్లుగాక నీ వెప్పుడేని నన్ను నప్రియంబులు వలుకు
దప్పుడ నిన్నుఁ బాసిపోదు ననిన శంతనుండు నొడంబడి
దానిం బరిగ్రహించె గంగయు మనుష్యస్త్రీరూపధారిణి
యై వాని కిష్టోపభోగంబులు సలుపు చుండె నంత. 149

సీ. వరుణుఁ డాదిగఁ గల । వసువులు దోషోన
పహతిచు నున్న న । హప్పాలంతి వారి
నల్లన పుట్టిన । యప్పుడ కొనిపోయి
నిర్దయ యై గంగ । నీరిలోన
వైచిన నెఱిఁగి య । వ్వసుమతీనాథుండు
దనయుల ని ట్లెల్ల । దయయు లేక
గంగలో వైచెదు । కడు నధర్మం బేల
చేసెదు నా నోడుఁ । జెలువ దన్నుఁ

ఆ. బాసి పోవు ననియుఁ । బలుకక యెప్పటి
యట్ల నెమ్మి నుండు । నంతఁ బుట్టెఁ
దనయుఁ డష్టముండు । దల్లిదండ్రుల కతి
ప్రీతియును ముదంబుఁ । బెరుఁగుచుండ. 150

వ. అక్కొడుకుం జూచి పుత్త్రిమోహంబునఁ జంప నీ నోపక
శంతనుండు గంగ కి ట్లనియె. 151

క. పడయంగ రానికొడుకులఁ
గడుఁ బలువురఁ బడసి పుత్త్రఘాతిని వైతి
కొడుకు నుదయార్కతేజుని
విడువఁగ నే నోప ననుచు వేడుకతోడన్. 152

వ. దాని నప్రియంబులు వలికి వారించిన నదియుం దొల్లి చేసిన సమయంబు దలంచి నీతోడిసంగతి నాకు నింతియ యేను బుణ్యజలప్రవాహ పవిత్రితం ద్రిభువనపావని యనం బరఁగినగంగఁ జుమ్మీ వసువులు వసిష్ఠుశాపంబున వసుమతిం బుట్టుచుండి యే మెందుఁజోట జన్మింపనోప మీయంద పుట్టెదము మర్త్యంబునం బెద్దకాలం బుండ కుండ మమ్ము ముక్తులం జేయు మని నన్నుం బ్రార్థించిన దేవహితార్థంబు మనుష్యస్త్రీరూపంబు దాల్చి నీవలన వసువులం బుట్టించితి దీన నీకుంబుణ్యలోకంబు లక్షయంబు లగు మఱియు నియ్యష్టమపుత్త్రుండు వసువులయం దొక్కొక్కళ్ళ చతుర్థార్థంబులు దాల్చి సకలధర్మమూర్తియయి పుట్టినవాఁడు లోకహితార్థంబుగా మర్త్యంబునం బెద్దకాలం బుండు ననిన గంగకు శంతనుం డి ట్లనియె. 153

క. వసువు లనువా రపేత
వ్యసనులు దేవతలు లోకవంద్యులు వారిన్
వసుమతిఁ బుట్టఁగ శాపము
వసిష్ఠముని యేల యిచ్చెఁ వారిజనేత్రా. 154

వ. మఱి వసువులు పుట్టుచు స్వర్గంబునకుం జనుటయు నీయ
ష్టమవసువు మర్త్యంబునం బెద్దకాలం బునికియు నేమికా
రణం బని యడిగిన వానికి గంగ యిట్లనియె. 155

చ. అతులతపంబునన్ వరుణుఁ ౝ డమ్మునిచే బహుపుణ్యకర్మసు
స్థితిఁ బ్రభవింపఁగాఁబడినౝదివ్యమునీంద్రుఁ డశేషలోకపూ
జితుఁడు వసిష్ఠుఁ డాశ్రమముఁౝజేసి తపం బొనరించె బ్రహ్మస
మ్మితుఁ డురురత్నరాజితసుౝమేరుమహీధరకందరంబునన్.

వ. మఱియు దక్షప్రజాపతిపుత్త్రి యయినసురభికిం గశ్యపు
నకుం బుట్టిననందిని దనకు హోమధేను వయి కోరినవస్తు
వులు గురియుచుండఁ దపంబు సేయుచున్న వసిష్ఠునాశ్ర
మంబునకు వసువు లెనమండ్రును భార్యాసహితు లై
క్రీడార్థంబు వచ్చి వసిష్ఠుహోమధేనువుం జూచి దానిశీలం
బునకు విస్మయం బందుచున్నచో నం దష్టమవసుభార్య
పతి కిట్లనియె. 157

ఆ. దీనిపాలు ద్రావిౝ మానవుల్ పదియువే
లేండ్లు జరయు రుజయుౝ నెఱుఁగ కమర
భావమున సుఖంబుౝ జీవింతు రఱు దీని
నేలఁ గనినవాఁడౝ వెందుఁ బెద్ద. 158

వ. మర్త్యలోకంబున నుశీనరపతికూఁతురు జితవతి యనుకో
మలి నాప్రియసఖి యే నెప్పుడు దానికిఁ బ్రియంబు గోరు
చుండుదు నిమ్మొదవు నమ్ముదిత కిచ్చి పుత్త్ర మనినఁ బ్రియ
యునివచనంబుల కనుగుణంబుగాఁ బ్రభాసుండు నిజభ్రాతృ

చోదితుం డయి వసిష్ఠుహోమధేనువుం బట్టికొని పోయిన నమ్మునియుం దనహోమధేనువుం గానక వనంబెల్లం గలయ రోసి తనయోగదృష్టిం జూచి దాని వసువులు గొనిపోక యెఱింగి. 159

ఆ. మనుజయోనిం బుట్టుండని వారి కప్పుడు
కోప మడర మునియు శాప మిచ్చె
భయము వొంది వివశులయి వచ్చి వారును
వినయమొనర నిట్టు లనిరి మునికి. 160

వ. నీవు ధర్మమూర్తివి మాచేసినయజ్ఞానంబు సహించి మర్త్యంబునం బెద్దకాలం బుండకుండ మా కనుగ్రహింపవలయు నని ప్రార్థించిన నమ్ముని ప్రసన్నుండయి మీకోరినయట్ల యగు నష్టముం డయినయాప్రభాసుండు పెద్దయు నపరాధంబుం జేసెంగావున వీఁడు మర్త్యలోకంబునం బెద్దకాలం బుండు ననపత్యుండు నగు ననియె నని గంగాదేవి తనస్వరూపంబుం జూపి వసూత్పత్తియు స్వర్గగమననిమిత్తంబును గాంగేయుజన్మస్థితియునుం జెప్పి దేవవ్రతుం డయినయిక్కుమారుండు పెరుఁగునంతకు నాయొద్దన యుండెడు మని శంతను నొడంబఱిచి కొడుకుందోడ్కొని యరిగిన విస్మయంబంది శంతనుండు దాసితోడి యిష్టోపభోగంబులం బెద్దకాలంబు సనిన నల్పకాలంబ కా వగచుచు హస్తిపురంబునకు వచ్చి. 161

మ. తన కాజ్ఞావశవర్తులై మహి సమస్తక్షత్రవంశేశు లె
ల్లను భక్తిం బని సేయుచుండఁగ విశాలంబైనసత్కీర్తి ది
గ్వనితామౌక్తికదామలీల వెలుఁగన్ వారాశిపర్యంతభూ
జనరక్షాపరుఁ డయ్యె శంతనుఁడు రాజద్రాజధర్మస్థితిన్

వ. ఇట్లు లోకం బెల్లఁ దనధర్మమార్గంబ పొగడుచుండ సుఖం
బుండి యాతం డొక్కనాఁడు మృగయావ్యాజంబున గంగా
సమీపంబునం జనువాఁడు దన్నుం బాసి తనుత్వంబుఁ దాల్చి
నట్టి గడునల్పప్రవాహం బై యున్న దాని గంగానదిం జూచి
యిది యేమినిమిత్తంబో యనుచుం గొండొకనేల యరిగి.

తరలము. కనియె ముందట నమ్మహీపతి గాంగసైకతభూములం
బను గొనన్ ధను వభ్యసించుచు బాణసంహతి సేతుగా
ఘనముగా నమరాపగౌఘముఁ గట్టియున్నకుమారు న
త్యనఘు నాత్మసమాను నాత్మజు నాపగేయు మహాయశున్.

వ. కని పుట్టిననాఁడ చూచినవాఁడు గావున నప్పు డెఱుంగ
నేరక విస్మయాకులితచిత్తుం డయి యుండెఁ గుమారుండు
నాతనిం జూచి తండ్రిగా నెఱుంగనేరకయు నిసర్గస్నేహ
మోహితుండు నయి యుండె నంత. 165

—♦ గంగ భీష్మునిం దెచ్చి శంతనున కిచ్చుట. ♦—

తే. దివ్యభూషణాలంకృత దేహుఁ డైన
కొడుకువలపలిచే యూఁది కోమలాంగి
దివ్యనది ప్రీతితోఁ జను దెంచి పతికిఁ
జూపి భూనాథ వీఁడు నీ సూనుఁ డనియె. 166

వ. మఱియు. 167

సీ. సాంగంబు లగుచుండ సకలవేదంబులు
సదివె వసిష్ఠుతో సకలధర్మ
శాస్త్రాదిబహువిధ శాస్త్రముల్ శుకబృ
హస్పతుల్ నేర్చిన యట్ల నేర్చెఁ
బరమాస్త్రవిద్య న ప్పరశురాముం డెంత
దక్షుఁ డంతియ కడు దక్షుఁ డయ్యె
నాత్మవిజ్ఞానంబు నందు సనత్కుమా
రాదులయట్టిఁడ యనఘమూర్తి

ఆ. నొప్పుగొనుము వీని నుర్వీశ యని సుతు
నిచ్చి గంగ సనిన నెఱిఁగి తనయు
నెమ్మిఁ దోడుకొనుచు నిధిఁ గన్న పేదయ
పోలె సంతసిల్లి భూవిభుండు. 168

వ. తనపురంబునకు వచ్చి సకలరాజన్యప్రధానసమక్షంబున గాంగేయునకు యౌవరాజ్యాభిషేకంబు సేసి కొడుకు తోడివినోదంబులం దగిలి నాలుగువత్సరంబు లనన్యవ్యాపారుండై యుండి యొక్కనాఁడు యమునాతీరంబున వేఁట లాడుచుఁ గ్రమ్మరువాఁ డపూర్వసురభిగంధం బాఘ్రాణించి దానివచ్చినవల నారయుచు నరిగి యమునాతీరంబున

క. కనకావదాతకోమల
తనులతఁ దనుమధ్యఁ గమల దళనేత్రను యో
జనగంధి నవనినాథుఁడు
గనియెను సురకన్యవోని కన్నియ నంతన్. 170

ఉ. దానిశరీరసౌరభము ౹ దాని విలోలవిలోకనంబులున్
దానిమనోహరాకృతియు౹దానిసుచిస్మితవక్త్రకాంతియున్
దానివిలాసముం గడు ము౹దంబునఁ జూచి మనోజబా
ణాసం । తానహతాత్ముఁ డై నృపతి ౹ దానికి నిట్లనియెం
బ్రియంబునన్. 171

ఉ. ఎందులదాన వేకతమ౹యియ్యమునానది నోడ సల్పుచున్
సుందరి నీకు నున్కి యిది ౹ సూడఁగఁ దా నుచితంబె
నావుడున్।మందమనోజ్ఞహాసముఖ౹మండల మెత్తి మృగా
క్షి సూచి సం।క్రిందనసన్నిభున్ నృపతిఁ౹గన్యక యిట్ల
ని పల్కెఁ బ్రీతితోన్. 172

వ.ఏను దాశరాజుకూఁతురఁ దండ్రిని యోగంబున నిక్కార్యంబి
ధర్మార్థంబు సేయు చుండుదు ననిన దాని యభినవరూప
సౌందర్యంబులు దొల్లియు విని యెఱింగినవాఁడై యక్కో
మలిం గామించి దాశరాజుకడకుం జని తన యభిప్రాయం
బెఱింగించిన నతండును సంతసిల్లి శంతను నత్యంతభక్తిం
బూజించి యిట్లనియె. 173

తే. పుట్టినప్పుడ కన్యకఁ౹బోలునట్టి
వరున కిచ్చుట యిది లోక౹వర్తనంబు
వసుమతీనాథ నీయట్టి౹వరున కిచ్చి
ధన్యులము గామె యిక్కన్యఁ౹దద్దపేర్మి. 175

వ. అయినను నాడెందంబునం గలదానిం జెప్పెద నిక్కన్యక
నీకు ధర్మపత్నిఁగాఁ జేయునట్టియిష్టంబు గలదేని నావేఁడిన

దాని నిమ్మనిన శంతనుండు దాని నీనగునేని నిచ్చెదఁ
గాని నాఁడీనేర నది యేది సెప్పుమనిన దాశరా జిట్లనియె.

మధ్యాక్కర. భూపాల నీకు నికోఁ్కమలియందుఁ బుట్టిన
సుతుఁడు । నీపరోక్షంబున రాజు గావలెఁ జెప్పినిఁ । న
నోపుదే యనిన శంతనుఁడు గాంగేయు యువరాజుఁ
దలఁచి।యీపల్కు దక్కఁగ నొండు వేఁడుము యిచ్చెద
ననిన. 176

వ. నా కొండెద్దియు నిష్టంబు లే దనిన విని యద్దాశరాజు
చేతం బ్రతిహతమనోరథుం డయి క్రమ్మఱి వచ్చి శంత
నుండు చింతాక్రాంతుం డయి సత్యవతిన తలంచుచు వీత
కార్యావసరుం డయి యున్న నొక్కనాఁడు గాంగేయుండు
తండ్రిపాలికి వచ్చి యి ట్లనియె. 177

చ. భవదభిరక్షితక్షితికి బాధ యొనర్పఁగ నోపునట్టిశా
త్రవనివహంబు లేదు వసుధాప్రజ కెల్ల ననంతసంతతో
త్సవముల రాజు లెల్ల ననిశంబు విధేయుల నీకు నిట్లు మా
నవవృషభేంద్ర యేలొకో మనఃపరితాపముఁ బొంది
యుండఁగన్. 178

వ. అనిన విని పెద్దయుంబ్రొద్దు చింతించి శంతనుండు గొడుకున
కి ట్లనియె. 179

క. వినవయ్య యేకపుత్త్రుఁడు
ననపత్యుఁడు నొక్కరూప యని ధర్మవుల
విని నీకుఁ దోడు పుత్త్రుల
ననఘా పడయంగ నిష్ట మయినది నాకున్. 180

క. జనవినుత యగ్నిహోత్రం
బును సంతానమును వేదకములు నెడతెగఁగాఁ
జన దుత్తమవంశజులకు
ననిరి మహాధర్మనిపుణు కైనమునీంద్రుల్. 181

క. నీ వస్త్రశస్త్రవిద్యా
కోవిదుఁడవు రణములందుఁ శూరుఁడ వరివి
ద్రావణసాహసికుండవు
గావున నీయునికి నమ్మఁగా నోప నెడన్. 182

వ. బహుపుత్త్రార్థంబు యత్నంబు సేయ వలయు వివాహం బయ్యెద ననిన విని గాంగేయుండు వృద్ధామాత్యపురోహితసుహృజ్జనంబులతో విచారించి యోజనగంధి రాజు చిత్తంబునం గలుగుట యెఱింగి యనేకరాజన్యసమన్వితుం డయి దాశరాజుకడకుం జని మారాజునకు సత్యవతిని దేవింగా నిచ్చునది యని యడిగిన నాతండును దేవవ్రతుం బూజించి నీవు ధర్మశీలుండ వర్థానర్థవిదుండవు సకల కార్యసమర్థుండవు గుర్వర్థంబు గన్యార్థివై వచ్చితివి కావునం గృతార్థుండ నైతి నెవ్వనివీర్యంబున నిక్కన్య యుద్భవిల్లె నట్టియుపరిచరుం డనురాజర్షి యీసత్యవతి నొరుల కీవలవదు శంతనునక యిచ్చునది యనుటం జేసి తొల్లి యసితుం డయినదేవలుండు కన్యార్థి యయి వచ్చి ప్రత్యాఖ్యాతుం డయ్యె నిట్టిసంబంధ మెవ్వరికిఁ బడయనగు. 183

క. విను మెనను సాపత్న్యం
బనుదోషము కలదు దీన నదియుచు నిచే

తన సంపాద్యము నీ వలి
గిన నడ్డమె పురహరాజ కేశవు లయినన్. 184

వ. ఆదోషం బెట్లు పరిహృతం బగు నట్లుగా నీచిత్తంబునం దలంచి వివాహంబు సేయు మనిన గాంగేయుం డిట్లనియె.

చ. వినుఁడు ప్రసిద్ధులైనపృథివీపతు లందఱు నే గురుప్రయో
జనమునఁ జేసితిన్ సమయ సంస్థితి యాలలితాంగి కుద్భ
విం। చినతనయుండ రాజ్యమును జేయఁగ నర్హుఁడు వాఁడ
మాకు నె। ల్లను బతి వాఁడ కౌరవకులస్థితికారుఁ
డుదారసంపదన్. 186

వ. అని సభాసదులకెల్ల మహాహర్షంబుగా సత్యవ్రతుండయిన దేవవ్రతుండు పలికిన నెండియు దాశరా జిట్లనియె. 187

క. నీ వఖిలధర్మవిదుఁడవు
గావున నీ కిట్ల చేయఁ గా దొరకొని యెన్
భావిభవత్సుతు లిట్టిరె
నీవిహితస్థితియుఁ జలుప నేర్తురె యనినన్. 188

క. ధృతిఁ బూని బ్రహ్మచర్య
వ్రత మున్నతిఁ దాల్చితిని ధ్రువంబుగ ననప
త్యత మైనను లోకము లా
యతిఁ బెక్కులు గలవు నాకు ననుభావ్యము లై. 189

వ. అని యిట్లు సత్యవతిని దనతండ్రికి వివాహంబు సేయు పొంటె నిజరాజ్యపరిత్యాగంబును బ్రహ్మచర్యవ్రతపరిగ్రహంబునుం జేసిన దేవవ్రతుసత్యవ్రతంబునకు గురుకార్య

ధురంధరత్వంబునకు మెచ్చి దేవర్షిగణంబులు నాతనిపయిం
బుష్పవృష్టి గురిసి భీష్ముం డని పొగడిరి దాశరాజును
గరంబు సంతసిల్లి శంతనునకు సత్యవతి నిచ్చె నంత. 190

మ. ఇనతేజుం డతిభక్తిఁ గాంచనరథంబెక్కించి యక్కన్యఁ దో
డ్తోని తెచ్చెం దనతల్లి సత్యవతి నిఖిలక్షోణీజనుల్ దన్నుం బొ
రనఁ గీర్తింపఁగ శంతనుం డతిమనోరాగంబునం బొంద శాం
తనవుం డాతతకీర్తి హాస్తిపురికిం దత్కౌతుకారంభుఁ డై.

వ. శంతనుండును బరమానురాగంబున సత్యవతిని వివాహం
బై యతిమానుషం బయినయాభీష్మసత్యవ్రతంబునకు
సంతసిల్లి యాతనికి స్వచ్ఛందమరణంబుగా వరం బిచ్చి
సత్యవతియందుఁ జిత్రాంగదవిచిత్రవీర్యు లన నిద్దఱు
గొడుకులం బడసి వారలు సంప్రాప్తయౌవనులు గాకుండఁ
బరలోకగతుం డైనఁ దండ్రికి భీష్ముండు పరలోకక్రియలు
నిర్వర్తించి చిత్రాంగదు రాజ్యాభిషిక్తుం జేసిన నాతం
డును నతివ్యాలోలుం డై గర్వంబున నెవ్వరి నుఱక సుర
దనుజ మనుజ గంధర్వాదుల నాక్షేపించుచున్న వాని
కలిగి చిత్రాంగదుం డనుగంధర్వపతి యుద్ధార్థి యయి
వచ్చినం గురుక్షేత్రంబునందు. 192

క. నరగంధర్వాధిపు ల
య్యిరువురు చిత్రాంగదులు సహింపక యని నొం
డొరుఁ దాఁకి వీఁకఁ బొడిచిరి
హిరణ్వతీతీరమున నహీనబలాఢ్యుల్. 193

క. వదలక మాయాయుద్ధా
తిదక్షుఁ డయి వంచనోన్నతిఁ గంధర్వుం
డుదితరవితేజుఁ జిత్రాం
గదుఁ జంపె విచిత్రపత్త్రికార్ముకహస్తున్. 194

వ. ఇట్లు చిత్రాంగదుండు గంధర్వునిహతుం డైనఁ దత్పరోక్షం
బున భీష్ముండు విచిత్రవీర్యుం గౌరవరాజ్యంబున కభిషిక్తుం
జేసిన. 195

క. వసునిభుఁడు పైతృకం బగు
వసుధారాజ్యంబు భీష్ము వచనమున గత
వ్యసనుఁ డయి తాల్చెఁ దేజం
బెసఁగంగ విచిత్రవీర్యుఁ డిద్ధయశుం డై. 196

వ. అట్టివిచిత్రవీర్యు నారూఢయౌవనుం జూచి భీష్ముండు
వివాహయత్నపరుం డయి తనచారులవలనం గాశీరాజు
కూఁతులస్వయంవరోత్సవంబు విని ధనుర్ధరుం డయి రథం
బెక్కి యొక్కరుండును వారాణసీపురంబునకుం జని యందు
స్వయంవరంబునకు మూఁగినరాజలోకం బెల్ల వెఱచి
వెఱఁగుపడి చూచు చుండ నక్కన్యకలఁ దనరథం
బెక్కించుకొని యెల్లవారలు విన నిట్లనియె. 197

క. నాయనుజునకు వివాహము
సేయఁగఁ గన్యాత్రయంబుఁ జేకొని బలిమిం
బోయెద నడ్డం బగువా
రాయతభుజశక్తి నడ్డ మగుఁ డాజిమొనన్. 198

వ. బ్రాహ్మంబు మొదలుగాఁ గలయెనిమిదివివాహములయందు
క్షత్త్రియులకుఁ గాంధర్వరాక్షసంబు లుత్తమంబులు స్వయం
వరంబున జయించి వివాహం బగుట యంతకంటె నత్యుత్త
మంబు గావున నిమ్మూఁగినరాజలోకంబు నెల్ల నోడించి
యిక్కన్యలం దోడ్కొని నాచనుట యిది ధర్మంబ యని
కాశీరాజునకుం జెప్పి వీడ్కొని భీష్ముండు వచ్చునప్పుడు.

మ. నరనాగాశ్వవరూథయూథములతో నానావనీనాథు లు
ద్ధురులై యొక్కట నొండొరుం జఱచి యుత్తుంగానిలో
ద్ధూతసా। గరసంక్షోభసమంబుగాఁ గలఁగి వీఁకన్ వీరు
లై తాఁకి యే। సిరి దేవవ్రతుపై నభోవలయ మచ్ఛి
ద్రంబు గా నమ్ములన్. 200

క. వారల నందఱ రౌద్రా
కారుండై కసిమసంగి గాంగేయుఁడు దు
ర్వారపటుబాణనిహతిని
వీరాహవరంగమునకు విముఖులఁ జేసెన్. 201

క. నెఱి నుఱక వైరివీరుల
నెఱఁకులు దూఱంగ నేయు నృపపుంగవునం
పఱ కోర్వక పిఱుసని రని
వెఱచి విషణ్ణు లయి సకల విషయాధిపతుల్. 202

వ. ఇట్లు నిఖిలక్షత్త్రియక్షయార్థం బలిగినపరశురాముండునుం
బోలెఁ గడు నలిగి పరశురామశిష్యుం డాక్షత్త్రవర్గంబు
నెల్లఁ దనశరధారావర్షంబున ముంచి యోడించి యేక

వీరుం డయి వచ్చువానిఁ బిలుకుంద సమరసన్నద్ధుం డయి సాల్వుండు సనుదెంచి. 203

—• సాల్వుఁడు భీష్మునితో యుద్ధంబు సేయుట. •—

ఉ. ఈవసుధాధినాథుల జయించినయట్టిద కాదు చక్కనై
పోవకనిల్వు నా కెదిరి పోర మదీయధనుర్విముక్తనా
నావిధమార్గణోగ్రగహనంబున దిగ్భ్రమఁ బొంద కెట్టయిం
బోవఁగఁ బోలు నీ కనుచుఁ బూరుకులోత్తముఁ దాఁకె
వీఁకతోన్. 204

వ. భీష్ముండును దనరథంబు నివర్తింపించి సంవర్తసమయసమ
వర్తియుం బోలె నతిరౌద్రాకారుం డయి నిలిచిన, 205

చ. అనిలజవంబునం బఱచునమ్మదనాగ మెదిర్చి క్రమ్మఱిం
చినపరికాఁడపోలెఁ గురుసింహవరూథము నిల్వఁగ్రమ్మఱిం
చు నె యితఁ డంచునుం దగిలి చూపఱు సాల్వమహాశు
విక్రమం బొనరఁగ నల్లడం బొగడుచుండిరి విస్మయసక్త
చిత్తులై. 206

వ. అంత. 207

క. ధృతిమెయి శతసంఖ్యయు దశ
శతసంఖ్యయు శతసహస్రసంఖ్యయును శతా
యుతసంఖ్యయుఁ గా దేవ
వ్రతుమీఁదను సాల్వుఁ డేసె వాఁడిశరంబుల్. 208

క. ఘనభుజుఁ డన్నియు నడుమన
తునియఁగ వడి నేసి వాని తురగచయస్యం

దనసూతుల నొక్కొక య
మ్మునఁ డెళ్లఁగ నేసె భరత ముఖ్యుఁడు పోరన్. 209

క. రథమును రథ్యంబులు సా
రథియును వృథ యైన భగ్న రథుఁడై భాగీ
రథికొడుకుచేత విమనో
రథుఁడై సాల్వుండు నిజపురంబున కరిగెన్. 210

వ. ఇట్లు సకలరాజలోకంబు నెల్ల నశ్రమంబున నోడించి సాల్వరాజు మందల విడిచి పరాక్రమలబ్ధ లయినకాశీరాజదుహితలం దోడ్కొని వచ్చి భీష్ముండు విచిత్రవీర్యునకు వివాహంబు సేయ నున్న నందుఁ బెద్దయది యైనయంబ యిట్లనియె. 211

ఆ. పరఁగ నన్ను సాల్వపతి వరియించినఁ
దండ్రిచేతఁ బూర్వదత్త నైతి
నమ్మహీశునకు నయంబున నెయ్యది
ధర్మ మెఱిఁగి దానిఁ దలఁపు మిపుడు. 212

వ. అనిన విని భీష్ముండు ధర్మవిదు లయినబ్రాహ్మణులయనుమతంబున దాని సాల్వరాజున కిచ్చి పుచ్చి మహోత్సవంబున నయ్యిరువురు కన్యకల విచిత్రవీర్యునకు వివాహంబు సేసిన. 213

ఉ. లాలితరూపయౌవనవిలాసవిభాసిను లైనయంబికాం
బాలికలన్ వివాహ మయి భారతవంశకరుండు కామలీ
లాలలితానుభోగరసలాలసుఁడై నిజరాజ్యభారచిం

తాలసుఁ డయ్యెఁ గామికి న । యంబున నొందు దలంపఁ
బోలు నే. 214

వ. ఇట్లు సకలవ్యాపారరహితుం డై కాశీరాజదుహితల నయ్యి
రువుర నతిప్రణయ గౌరవంబునం దగిలి. 215

సీ. అమలసుధారమ్య । హర్మ్యతలంబుల
నవకుసుమామోద । నందనములఁ
గృతకాద్రికందర । క్రీడాగృహాంగణ
వివిధరత్నోపల । వేదికలను
గలహంసకలనాద । కమనీయకమలినీ
దీర్ఘికాసైకత । తీరములను
రమియించుచును గామ । రాగాధికాసక్తిఁ
జేసి శోషించి వి । చిత్రవీర్యుఁ

ఆ. డమరపురికిఁ జనిన । నతనికిఁ బరలోక
విధుల శాస్త్రదృష్టి । వెలయఁ జేసె
నాపగాతనూజుఁ । డఖిలబాంధవులయు
బ్రాహ్మణులయుఁ దోడ । భానునిభుఁడు. 216

వ. మఱియు నత్యంతశోకార్ణవంబున మునింగిన తల్లిని మఱఁ
దండ్రను నాశ్వాసించి యరాజకం బయినరాజ్యం బకలం
కంబుగాఁ బ్రతిపాలించుచున్నకొడుకు నఖిలధర్మవిదు
గాంగేయుం జూచి సత్యవతి యిట్లనియె. 217

క. శంతనుసంతానంబును
సంతతకీర్తియును బిండ । సంస్కృతియును న

త్యంతమహీభారమును బ
రంతప నీయందఁ జిరతరం బై నిలిచెన్. 218

చ. జననుత సర్వధర్మవులు సర్వజగత్పరివర్తనక్రమం
బును మఱి సర్వవంశములుఁ బుట్టిన మార్గము నీవ నిక్కువం
బనఘ యెఱుంగు దున్నతగుణాఢ్యుఁడవున్ భరతాన్వ
యావలంబనుఁడవు నీవ నిన్నొకఁడు పంచెదఁ జేయుము
మత్ప్రియంబుగన్. 219

క. ఇక్కురువంశంబున నీ
వొక్కరుఁడవ యున్నవాఁడ వుర్వీరాజ్యం
బెక్కటి సేకొని తేజము
దిక్కుల వెలిఁగింపు సంతతియుఁ బడయు మొగిన్.

క. నిరతంబు బ్రహ్మ మొదలుగ
వరుసన యెడతెగక యిట్లు వచ్చినవంశం
బురుభుజ నీ వుండఁగ నీ
తరమున విచ్ఛిన్న మగుట ధర్మవె యనినన్. 221

క. విని భీష్ముఁ డనియె మీ కి
ట్లని యానతి యీయఁ దగునె యమ్మయి నాప
ల్కినపల్కును మఱి నా తా
ల్చిన వ్రతమును జెఱుప నంత చిఱుత నె చెపుమా.

క. హిమకరుఁడు శైత్యమును న
ర్యముఁడు మహాతేజమును హుతాశనుఁ డుష్ణ
త్వము విడిచి రేని గుర్వ
ర్థము నాచేకొనిన సద్వ్రతంబు విడుతు నే. 223

వ. పృథివ్యాదిమహాభూతంబులు గంధాదిగుణంబుల నెట్లు విడువ వట్ల యేనును గురుకార్యంబున మీ కుల్కార్థం బుగా సర్వజనసమక్షంబున నాచేసిన సమయస్థితి విడువ నది యట్లుండె మీయానతిచ్చినట్లు నాయెఱుంగని ధర్మ వులు లేవు శంతనుసంతానంబు శాశ్వతం బగునట్లుగా క్షత్త్రధర్మంబు సెప్పెద నా చెప్పినదాని ధర్మార్థవిదులై లోకయాత్రానిపుణు లయిన పురోహితప్రముఖ నిఖిల బ్రాహ్మణవరులతో విచారించి చేయునది యని భీష్ముం డందఱు విన నిట్లనియె. 224

చ. పితృవధజాతకోపపరిపీడితుఁడై జమదగ్నిసూనుఁ డు ద్ధతబలు హైహయుఁ సమరదర్పితుఁ జంపి యశేష ధారుణీ। పతులను జంపె గర్భగత బాలుర నాదిగ నట్టిచోటఁ దత్సతులకుఁ దొల్లి ధర్మవిధి సంతతి నిల్పరె భూసురోత్తముల్. 225

—♦ దీర్ఘతమునివృత్తాంతము. ♦—

వ. మఱి యదియునుం గాక యుతథ్యుం డనుమునివరునిపత్ని మమత యనుదాని గర్భిణి నభ్యాగతుం డయి బృహస్పతి దేవరన్యాయంబున నభిలషించినఁ దదీయగర్భస్థుం డయిన పుత్త్రుం డెఱింగి యిది ధర్మవిరుద్ధం బని యాక్రోశించిన వానికి నలిగి బృహస్పతి సర్వభూతేప్సితం బైనయిక్కార్యం బునందు నాకుఁబ్రతికూలుండ వయితివి కావున దీర్ఘతమం బును బొందు మని శాపం బిచ్చిన వాఁడును దీర్ఘతముండు

నాఁ బుట్టి సకలవేదవేదాంగవిదుం డై జాత్యంధుం డయ్యును దనవిద్యాబలంబునఁ బెద్దకాలంబునకుఁ బ్రద్వేషిణి యనునొక్క బ్రాహ్మణి వివాహం బయి గౌతమాదు లయినకొడుకులం బెక్కండ్రం బడసిన నది లబ్ధపుత్త్రయై తన్ను మెచ్చకున్న నిట్లేల నన్ను మెచ్చవని దీర్ఘతముండు ప్రద్వేషిణి నడిగిన నది యిట్లనియె. 226

తే. పతియు భరియించుఁ గావున ♦ భర్త యయ్యెఁ
భామ భరియింపఁబడుఁ గాన ♦ భార్య యయ్యెఁ
బరఁగ నవి మనయందు వీ ♦ డ్వడియె నిన్ను
నేన యెల్ల కాలము భరి ♦ యింతుఁ గాన. 227

ఆ. ఎంతకాల మయిన ♦ నిప్పాట భరియింప
నోప నింక నరుగు ♦ మొందుకడకు
ననిన నిర్దయాత్మ ♦ లని దీర్ఘతముఁ డల్గి
సతుల కెల్ల నపుడు ♦ శాప మిచ్చె. 227

క. పతిహీన లయిన భామిను
లతిధనవతు లయ్యుఁ గులజ ♦ లయ్యును ననలం
కృత లయ్యెడు మాంగల్యర
హితలయ్యెడుఁగృపణవృత్తి ♦ నిదియు మొదలుగాఁ. 228

వ. అని శాపంబిచ్చిన దీర్ఘతమునకు నలిగి ప్రద్వేషిణి యిమ్ముదుకని నెటయేనియుం గొనిపొండని తనకొడుకులం బంచిన వారును నయ్యౌతథ్యు నతివృద్ధు జాత్యంధు నింధనంబులతో బంధించి మోహాంధు లయి గంగలో విడిచిన

నమ్మునియును బ్రవాహవేగంబునఁ బెక్కుదేశంబులు గడచి చనియె నంత నొక్కనాఁడు బలియనురాజు గంగాభిషేకార్థంబు వచ్చినవాఁ డయ్యింధనబంధనంబున నుండియు నుదాత్తానుదాత్తస్వరితప్రచయస్వరభేదంబు లేర్పడ సలక్షణంబుగా వేదంబులం జదువుచుఁ దరంగఘట్టనంబునం దనయున్నదరిఁ జేర వచ్చినవానిఁ దీరంబుఁ జేర్చి యింధన బంధనంబులు విడిచి మహర్షి మామతేయుంగా నెఱింగి తన్నెఱింగించి నమస్కారంబు సేసి యి ట్లనియె. 230

క. ఎందుండి వచ్చి తిందుల
కెందుల కేఁగెదు మహాము నీశ్వర విద్వ
ద్వందిత నాపుణ్యంబునఁ
జెందితి ని న్నిష్టఫలముఁ జెందిన పాటన్. 231

వ. ఏ నపుత్త్రకుండనై యెవ్విధంబునను సంతానంబు వడయనేర కున్నవాఁడ నాకు సంతానదానంబు దయసేయుమని యతనిం బూజించి తనపురంబునకుం దోడ్కొని చని ఋతుమతి యై యున్న తనదేవి సుదేష్ణ యనుదాని సమర్పించిన నదియును. 232

ఆ. పుట్టుఁజీకు వృద్ధుఁ బూతిగంధానను
వేదజడునిఁ బొంద వెలఁది రోసి
తన్న పోనిదానిఁ దన్విఁ గోమలిఁ దన
దాసికూఁతుఁ బంచె దపసికడకు. 232

వ. ఆదీర్ఘతముండును దానివలనఁ గాక్షీవదాదుల నేకాదశ పుత్త్రిలం బుట్టించిన బలియును సంతసిల్లి వీరలు నాకుల పుత్త్రికులే యనిన నమ్ముని వాని కి ట్లనియె. 234

క. వీరలు నీకులపుత్త్రిలు
గారు భవద్దేవిదాది కె గాదిలిసుతకుఌ
భూరిభుజ యుద్భవించిన
వారు మహాధర్మపరు ల కె వారితసత్త్వల్. 235

వ. అనిన నబ్బలి సంతానార్థి గావున వెండియు నమ్మునిం బ్రార్థించి తత్ప్రసాదంబు వడసి సుదేష్ణ నియోగించిన దీర్ఘత ముండును దానియంగంబు లెల్ల నంటిచూచి వంశకరుం డును మహాసత్త్వుండును నయ్యెడుకొడుకు నీకుం బుట్టు నని యనుగ్రహించిన దానికి నంగరా జనురాజర్షి పుట్టె నివ్విధంబున నుత్తమక్షత్త్రియక్షేత్రంబులందు ధర్మ మార్గంబున బ్రాహ్మణులవలనం బుట్టె వంశకరు లయిన క్షత్త్రియు లనేకులు గలరు. 236

క. కావున నియతాత్ము జగ
త్పావను ధర్మస్వరూపు కె బ్రాహ్మణుఁ బడయం
గా వలయు వాఁడు సంతతిఁ
గావించు విచిత్రవీర్య కె క్షేత్రములఌ. 237

వ. అనిన భీష్ముపలుకులకు సంతోషించి సత్యవతి వ్రాల్లి కొం డుకనాఁడు దనకన్యయై యున్నకాలంబునఁ బరాశరుండు దన్నుఁ గామించుటయు నమ్మునివరంబునఁ దనకన్యాత్వంబు

దూషితంబు గా కునికియుఁ దత్ప్రసాదంబునం జేసి యమునా ద్వీపంబునఁ గృష్ణద్వైపాయనుండు గానీనుం డయి సద్యో గర్భంబునఁ బుట్టి పని గల యప్పుడ తన్నుఁ దలంచునది యని చెప్పి తపోవనంబునకుం జనుటయును భీష్మునకుం జెప్పి నిజతపోదహనదగ్ధపాపేంధనుం డయినకృష్ణద్వైపాయనుం డఖిలధర్మమూర్తి నిత్యసత్యవచనుండు నాని యోగంబున నీయనుమతంబున భవద్భ్రాతృక్షేత్రంబులయందు సంతానంబు వడయు ననిన సత్యవతివలన నమ్మహర్షికీర్తనంబు విని భీష్ముండు కరకమలంబులు మొగిచి వ్యాసభట్టారకుఁ డున్నదిక్కునకు మ్రొక్కి తొల్లి జగంబు లుత్పాదించిన యాదిబ్రహ్మకుం గలసామర్థ్యంబు గలవేదవ్యాసుం డి క్కురువంశంబుఁ బ్రతిష్ఠించునది యెల్లవారికి నభిమతంబ యనిన సత్యవతి కురువంశోద్వహనార్థంబు పారాశర్యుం దలంచుడు నాక్షణంబ. 238

ఉ. నీలగిరీంద్రశృంగమున ♦ నిర్మల మైనసువర్ణవల్లరీ
జాలమువోనిపింగళవి ♦ శాలజటాచయ మొప్పఁగా వచ
శ్శ్రీలలితుండు వచ్చి నిలి ♦ చెఁ గ హారినీలవినీలవిగ్రహా
రాళరుచుల్ వెలుంగఁగఁ బరాశరసూనుఁడు తల్లిముందటన్

వ. సత్యవతియును బెద్దకాలంబునకు వచ్చినయాప్రథమపుత్త్రు నతిహర్షంబునం గౌఁగిలించికొని యవిరళపయోధరపయో ధారల నానందబాష్పధారలం జేసి యభిషేకించుచున్న నమ్మునివరుండును దల్లిబాష్పజలంబులు దుడిచి యభివాద

నంబు సేసి పురోహితపురస్సరభూసురవరులతో విధిపూర్వకం
బుగా భీష్ముండు సేసిన యర్ఘ్యాదిపూజలు సేకొని సుఖాసీనుం
డైయున్న నమ్మహామునిం గుశలంబడిగి సత్యవతి యిట్లనియె.

క. జనకునకును స్వామిత్వము
తనయోద్దేశమునం గలిమి తథ్యము యది య
జ్జననికిం గలుగున కావునం
జనుం బనిం బంపంగ నిన్ను జననుత నాకున్. 241

చ. అనుపమరాజ్యసంపదకు నర్హుండు వంశము విస్తరింపనో
పినసుచరిత్రుం డీసుతుండు భీష్ముండు దొల్లియుం దండ్రికిం
బ్రియం బనఘుండు సేయు చుండి నిఖిలావనిరాజ్య
నివర్తనంబునుం దనరంగ బ్రహ్మచర్యమును దాల్చె
జగద్విదితప్రతిజ్ఞుం డై. 242

క. ఈయన్వయవిచ్ఛేదము
నీయెఱుంగనియదియె సన్ము నిస్తుత జగముల్
నీయంద నిలిచినవి గా
వే యిక్కాలత్రయప్రవృత్తులతోడన్. 243

క. ధృతి నీయనుజుండై వి
శ్రుతుండైనవిచిత్రవీర్యు సుక్షేత్రములన్
సుతులం బడయుము కుల మవి
రతసంతతి నెగడ దేవ రన్యాయమునన్. 244

క. నీకారణమున వంశ మ
నాకుల మై నిలుచుటయుం దగ దాప్తులుం బ్రజలున్
శోకభయంబులు విడుతురు
నాకును భీష్మునకుం గడు మనఃప్రియ మెసంగన్. 245

క. అని సత్యవతి నియోగిం
చిన వేదవ్యాసుఁ డట్లు చేయుదు నిది యెం
దును గలధర్మువ యెప్పుడు
వినఁబడు నానాపురాణవివిధశ్రుతులన్. 246

వ. ఇక్ష్వాకుశ్రీరాజదుహితలయందు ధర్మస్థితిం బుత్త్రోత్పత్తిఁ గావించెద వీరలు నా చెప్పినవ్రతం బొకసంవత్సరంబు సేసి శుద్ధాత్మ లగుదు రేని సత్పుత్త్రులు పుట్టుదు రనిన సత్యవతి యిట్లనియె. 247

క. ప్రకటముగ వంశవిస్తా
రకు లగు పుత్త్రకులఁ జెచ్చెరం బడయు మరా
జక మయినధారుణీప్రజ
కొకనిమిషం బయినఁ బ్రకృతి నుండఁగ లావే. 248

చ. అవని యరాజకం బయినయప్పుడ భూప్రజలందు సర్వధ
ర్మవులుఁ దొలంగు దేవముని ముఖ్యులు వాయుదు రొలి
వృష్టి లేదవు మఱి యధ్వరుల్ దఱుఁగు నందురు గావు
నఁ గాలయాపనం బవితథవాక్య చేయక నయంబున
రాజ్యము నిల్పు మిత్తఱిన్. 249

క. దయ నీచే నుత్పాదితు
లయినసుతులు దమ్మెఱుంగు నంతకు భీష్ముం
డయనయశాలి సమర్థుం
డయి చేకొని రాజ్యభార మారయుచుండున్. 250

వ. అని సత్యవతి కృష్ణద్వైపాయను నియోగించి ఋతుమతి యు శుచిస్నాతయు నై యున్న యంబికకడకుం జని క్షేత్రజుం డైనవాఁడు సుపుత్త్రుండు గావున ధర్మ్యం బైనవిధానం

బున నీవు రాజ్యధురంధరుం డయిన కొడుకుం బడసి భరత
వంశంబు నిలుపు మెల్లధర్మంబులకంటెఁ గులంబు నిలుపు
టయ మిక్కిలి ధర్మంబు నేటిరాత్రి నీకడకు దేవరుండు
వచ్చుం దదాగమనంబుఁ బ్రతీక్షించియుండునది యని
కోడలినొడంబఱిచి యనేకసహస్రమహీసురులను దేవతలను
ఋషులను నిష్టభోజనంబులం దనిపియున్న నారాత్రియందు.

క. తివిరి సుతజన్మ మెట్టిం
డవునొకొ దేవరుఁడు నాకు ననుచును నవప
ల్లవకోమలాంగి యంబిక
ధవళేక్షణ విమలశయన తలమున నున్నన్. 252

మధ్యాక్కర. అవసరజ్ఞుం డయి వ్యాసుఁ డేతెంచె నంత న
త్తపసి। కవిలగడ్డంబును గవిలజడలును గవిలకన్నులును
దవిలయున్నవనల్లనైనదీర్ఘపుం దనువును జూచి
యువిద గన్నుంగవ మొగిచి తెలవక యుండె భయమున.

వ. కృష్ణద్వైపాయనుండును దానికిం బుత్త్రదానంబు సేసి
యాయంబికయందు బలపరాక్రమవంతుం డయినకొడుకు
పుట్టు వాఁడు మాతృదోషంబున నంధుండగు ననిన విని
విషణ్ణచిత్త యయి సత్యవతి వెండియుం గృష్ణద్వైపాయ
నుం బ్రార్థించి యింక నంబాలికయం దొక్కకొడుకుం
బడయు మని నియోగించిన నెప్పటియట్ల యమ్మునివరుండు
నంబాలికకడకుం జనిన నదియుం దనవేషంబునకు వెఱచి
వెల్లనై యున్న నక్కోమలికిం బుత్త్రదానంబు సేసి యీ
యంబాలిక యందు మహాబలపరాక్రమగుణవంతుండు
వంశకరుండు నగుపుత్త్రుండు పుట్టు వాఁడును మాతృదోషం
బునఁ బాండుదేహుం డగు నని చెప్పి యరిగిన. 254

—• ధృతరాష్ట్రపాండురాజులజననము. •—

క. బలవన్మదనాగాయుత
బలయుతుఁడు సుతుండు పుట్టెఁ బ్రజ్ఞాచక్షుం
డలఘుఁడు ధృతరాష్ట్రుం డా
లలనకు నంబికకుఁ గురుకులప్రవరుం డై. 255

క. అంబాలికకును గుణర
త్నాంబుధి పాండురవిరాజితాంగుఁడు ప్రభవిం
చెం బాండురాజు గురువం
శంబు ప్రతిష్ఠింప ధర్మసర్వజ్ఞుం డై. 256

వ. ఇట్లు క్రమంబునం బుట్టినధృతరాష్ట్రపాండుకుమారులకు బ్రాహ్మణసమేతుం డై భీష్ముండు జాతకర్మాదిక్రియ లొన రించె నంత నాంబికేయు జాత్యంధుం జూచి దుఃఖిత యయి సత్యవతి వెండియుఁ బారాశర్యుం దలంచుడు నాక్షణంబ యమ్మునివరుండు వచ్చి పని యేమి యనియన్న నయ్యంబికకుఁ బ్రథమపుత్త్రుఁ డంధుం డయ్యె నింక నొక్కకొడుకు రూపవంతుం బడయు మనిన నిది నియతాత్మ యగు నేని సుపుత్త్రుండు పుట్టు ననవుడు సత్యవతి తొల్లింటియట్ల కోడలి నియోగించిన నక్కోమలి యమ్మునివరు వికృతవేషరూప గంధంబుల కోపక రోసి తనదాసి ననేకభూషణాలంకృతం జేసి యాశయనతలంబున నుండం బంచిన వ్యాసభట్టారకుండు వచ్చి దానిచేసినయిష్టోపభోగంబులం దుష్టుం డై దానికిం బుత్త్రదానంబు సేసిన 257

ఆ. చండకోపుఁ డయిన మాండవ్యమునివరు
శాపమున జముండు సంభవిల్లె

విదురుఁ డనఁగ ధర్మ విదుఁడు పారాశర్య
వీర్యమున నవార్య వీర్యబలుఁడు. 258

వ. అనిన విని జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె. 259

ఆ. సకలజీవరాశి సుకృత దుష్కృత ఫల
మెఱిఁగి నడపు చున్న యట్టిధర్ముఁ
డిందు శూద్రయోని యందు మాండవ్యుచే
శప్తుఁ డై య దేల సంభవించె. 260

వ. అని యడిగిన వానికి వైశంపాయనుం డిట్లని చెప్పె మాండవ్యుం డనుబ్రహ్మర్షి దొల్లి మహీవలయంబునం గలతీర్థంబు లెల్ల నేకచారి యయి సేవించి యొక్క నగరంబున కెడ గలుగునడవిలో నాశ్రమంబు గావించి తద్ద్వారవృక్షమూలంబున నూర్ధ్వబాహుం డయి మౌనవ్రతంబునం దపంబుసేయుచున్న నన్నగరంబురాజునర్థంబు ముచ్చిలికొని ముచ్చు లారెకులచేత ననుధావ్యమానులై మాండవ్యసమీపంబునం బాఱి యయ్యాశ్రమంబులోఁ డాఁగిన వారివెనుదగిలివచ్చిన యారెకు లమ్మునిం గని రాజధనాపహారు లయినచోరులు నీయొద్దన పాఱి రెట వోయి రెఱుంగుదేనిఁ జెప్పు మనిన నమ్ముని మౌనవ్రతుండు గావునఁ బలుకకున్న నయ్యాశ్రమంబులోఁ జొచ్చి వెదకి ధనంబుతోడ నాముచ్చులం బట్టికొని 261

ఆ. తాన చోరులకును దాపికాఁ డై వేష
ధారి మిన్న కేనిఁ దపముసేయు
చున్నయట్లు వలుక కున్నవాఁ డని మొగ్గ
లాడి యారెకులు నయంబు లేక. 262

వ. మాండవ్యు నాముచ్చులతోన కట్టి కొనివచ్చి రాజునకుం జూపి ధనం బొప్పించిన రాజు నాముచ్చులం జంపించి తపోవేషంబున నున్నముచ్చని యమ్మాండవ్యునిం బురంబువెలుపల శూలప్రోతుం జేయించిన 263

క. మునివరుఁ డట్లుండియుఁ దన
మనమున నతిశాంతుఁ డయి సమత్వమునఁ దప
మ్మొనరించె ననశనుం డ
య్యును బహుకాలంబు ప్రాణయుక్తుం డగుచున్. 264

వ. ఇట్లు శరీరదుఃఖంబు దలంపక తపంబు సేయుచున్నయమ్ముని తపంబు పేర్మికి మెచ్చి మహామునులు పక్షు లయి రాత్రి వచ్చి మునీంద్రా యిట్టిమహాతపస్వివైననీ కిట్టిదుఃఖంబు గావించినవా రెవ్వరని యడిగిన వారికి నమ్మాండవ్యుం డిట్లనియె 265

తే. ఎఱిఁగి యెఱిఁగి నన్నడుగంగ నేల దీని
సుఖము దుఃఖంబుఁ బ్రాప్తించు చోట నరుఁడు
దగిలి తనకర్మవశమునఁ దనకుఁ దాన
కర్తగా కన్యులకు నేమి కారణంబు. 266

వ. అని యమ్మహామునులతో మాండవ్యుండు పలికినపలుకు లన్నగరరక్షకులు విని వచ్చి రాజున కెఱింగించిన రాజును బఱతెంచి శూలప్రోతుం డయి యున్నమాండవ్యునకు నమస్కరించి నాచేసినయజ్ఞానంబు సహించి నాకుం బ్రసాదింపవలయునని శూలంబువలన నమ్మునిం బాచుచో నది పుచ్చరాకున్న దానిమొదలు మెత్తన తునిమించినఁ దత్కంఠపార్శ్వమునందు శూలశేషం బంతర్గతం బై యుండె

దానం జేసి యణిమాండవ్యుండు నాఁ బరఁగుచు నమ్మహా
ముని ఘోరతపంబు సేసి యెల్లలోకంబులు గమించి
యొక్కనాఁడు యమునిపురంబునకుం జని ధర్మరాజున కి
ట్లనియె. 267

క. దండధర యిట్టిదారుణ
దండమునకు నేమిదుష్కృతముఁ జేసితి ను
గ్రుండ వయి తగనిదండము
దండింపఁగ బ్రాహ్మణుండఁ దగునే నన్నున్. 268

వ. అనిన మాండవ్యునకు ధర్మరా జిట్లనియె. 269

క. సోలయక తూనిఁగలం గొ
ఱ్ఱులఁ బెట్టితి నీవు నీచి అతకాలము త
త్ఫల మిప్పు డనుభవించితి
తొలఁగునె హింసాపరులకు దుఃఖప్రాప్తుల్. 270

వ. అనిన మాండవ్యుం డలిగి జన్మంబు మొదలుగాఁ బదు
నాలుగువత్సరంబులు దాఁటునంతకుఁ బురుషుండు బాలుండు
వాఁ డెద్ది సేసినఁ బాపంబుం బెద్ద పొరయండు వానికి
నోరు లెగ్గు సేసినఁ బాతకు లగుదు రిది నాచేసినమర్యాద
నీ విట్టిధర్మంబు దలంపక బాల్యంబున నల్పదోషంబుఁ జేసిన
నాకు బ్రాహ్మణోచితంబు గాని క్రూరదండంబు దండిం
చినవాఁడవు మర్త్యంబున శూద్రయోనిం బుట్టుమని శాపం
బిచ్చుటం జేసి వాఁడు విదురుం డై పుట్టె. 271

క. అని మాండవ్యాఖ్యానము
జనమేజయునకు నుదారచరితునకుఁ బ్రియం

బునఁ జెప్పెను వైశంపా
యనుఁ డవితథపుణ్యవచనుఁ డని కడు భక్తిన్. 272

క. సత్యాశ్రయ కులశేఖర
నిత్యోదయ రాజరాజ నృప సుకవిజన
స్తుత్య మహాగుణ విమలా
దిత్యాగ్రతనూజ విమల ధీరమణీయా. 273

ద్రుతవిలంబితము. త్రిభువనాంకుశ దీప్తినిధీ సమ
స్తభువనాశ్రయ ధర్మధురంధరా
శుభయశఃపరి శోభితపూర్వది
క్ప్రభువిలాస కృపారసబంధురా. 274

గద్యము. ఇది సకలసుకవిజనవినుతనన్నయభట్టప్రణీతం బైన శ్రీమహాభారతంబునం దాదిపర్వంబునం గౌరవవంశకీర్తనంబును గంగాశంతనుసమాగమంబును వసూత్పత్తియు స్వర్గగమనంబును దదంశసంఘాతంబునగాంగేయజన్మంబును దదాజ్యనివర్తనంబును బ్రహ్మచర్యవ్రతప్రతిజ్ఞాపరిపాలనంబును సత్యవతీవివాహంబును జిత్రాంగదవిచిత్రవీర్యుల జన్మంబును జిత్రాంగదమరణానంతరంబున భీష్ముండు విచిత్రవీర్యు రాజ్యంబున నిలుపుటయు విచిత్రవీర్యునివివాహంబును వానిపరోక్షంబునఁ గృష్ణద్వైపాయనువలన ధృతరాష్ట్రపాండురాజులజన్మంబును మాండవ్యశాపంబున విదురుజన్మంబును నన్నది చతుర్థాశ్వాసము. 275

---

గుంటూరు చంద్రికాముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.

శ్రీహయగ్రీవాయ నమః

# శ్రీమదాంధ్రమహాభారతము

## ఆదిపర్వము

### లఘుటీక

---

(1) "మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని చ శాస్త్రాణి ప్రథంతే" అను నియమమును బట్టి శ్రీవాగనుశాసనులు పంచమవేదం బగు భారతము నాంధ్రీకరింపఁబోవుచుఁ దొల్త నాశీర్వాదరూపం బగు మంగళంబును "శ్రీవాణీగిరిజాః..." అను శ్లోకముతోఁ జేయుచున్నాఁడు.

యే=ఎవరు, చిరాయ=అనాదికాలమునుండియు, శ్రీ, వాణీ, గిరిజాః=లక్ష్మీసరస్వతీపార్వతులను, వక్షః, ముఖ, అంగేషు=వక్షఃస్థలంబున, నోట, దేహమునందును, దధతః=ధరించుచు, లోకానామ్=లోకములకు, స్త్రీపుంస యోగ, ఉద్భవామ్=స్త్రీపురుషుల కలయిక వలనఁబుట్టుక గల, స్థితిమ్=ఉనికిని, ఆవహంతి=చేయుచున్నారో, తే=అట్టి, వేదత్రయమూర్తయః=వేదత్రయస్వరూపులును, సురైః=దేవతలచే, సంపూజితాః=చక్కఁగాఁబూజింపఁబడిన, పురుషోత్తమ, అంబుజభవ, శ్రీకంధరాః=విష్ణు, బ్రహ్మ, శివులు-అను, త్రిపురుషాః=మూగురుపురుషులును, శ్రేయసే=మేలుకొఱకు, భూయాసుః=అగుదురుగాక !

(2) హారిహారహిరణ్యగర్భ, పద్మా, ఉమా, వాణీపతుల=లక్ష్మీపార్వతీసరస్వతీభర్త లగు విష్ణుశివవిరించులను—మయూరవ్యంసకాదులం దప్ప నిట్లు విశేష్యపూర్వపదకర్మధారయ మన్యత్ర మృగ్యము. ఇచ్చట "హారిహార హిరణ్యగర్భులఁ బద్మోమావాణీపతుల" అని కవికృతపాఠమై యుండునని కొందఱు తలంతురు.

(3) అన్యరాజ=ఇతరరాజులయొక్క, తేజః=పరాక్రమముయొక్క జయ=గెలుపుచే, శాలి=ఒప్పుచున్న, శౌర్యుఁడు=శూరత్వముగలవాఁడు. అపరాజిత=ఓటమిలేని, భూరి=గొప్ప, భుజా=భుజమునందలి, కృపాణ= కత్తియొక్క, ధారా=వాదరయను, జల=నీటిచే, శాంత=అడఁగిన, శాత్రవ= శత్రువులవెడు, పరాగుఁడు=దుమ్ముకలవాఁడు.

(4) వివిధ=పెక్కు, ఆగమ=వేదములయందు, విహిత=చేయఁబడిన, శ్రముఁడు= పరిశ్రమకలవాఁడు. తుహినకరుఁడు = చంద్రుఁడు (మంచు కిరణములయందుఁ గలవాఁడు)

(5) ఘన=గొప్ప, దురిత=పాపములయొక్క, అనుబంధ=సంబంధముగల, కలకాల=కలిసమయమువలన, ?=పుట్టిన, దోష=దోషములను, తుషారసంహతిక్=మంచుమొత్తమును. చోసి=తోలి

(6) సర్వలోకాశ్రయుఁడు=ఎల్లజనములకును ఆశ్రయమైనవాఁడు (ఇది రాజరాజనరేంద్రునకు బిరుదనామము)

(7) ఇది సర్వప్రాసనీసము. ఉక్కు= గర్వము, అగ్రజన్ములకున్ = బ్రాహ్మణులకు, మహాత్ + విభూతిక్ =గొప్పసంపదను

(8) దౌవారిక=ద్వారపాలకులు,

(9) ఇదియు సర్వప్రాసనీసము- మతి, అమరాధిప, ఆచార్యన్=బుద్ధి యందు బృహస్పతిని

(12) ఏనుక్=అయినను-(నా) నేను భూదేవ = (బ్రాహ్మణులయొక్క, కుల = సమూహమును, అభితర్పణ=తనివి నొందించుటయందు. ?యః= గొప్ప, ప్రీతియున్=సంతోషమును

(14) హిమకరున్, తొట్టి=చంద్రుఁడు మొదలుకొని

(15) అమల=నిర్మలములైన, సువర్ణశృంగ, ఖురము, ఐ=బంగారు పుఁగొమ్ములు గిట్టలునుగలదియై, వేదవిప్రులకున్=వేదములే ప్రధానములుగాఁ

గలబ్రాహ్మణులకు. ఇది మధ్యమపదలోపిసమాసము, భారత,కథా,శ్రవ ణ, ప్రవణంబు=భారతకథను వినుటయందాసక్తిగలది.

(16) జన=జనులచేఁ, నుత=పొగడఁబడిన, కృష్ణద్వైపాయనమునివృషభ= కృష్ణద్వైపాయనుఁడు (వ్యాసుఁడు) అనుమునిశ్రేష్ఠునిచే, (సింహశార్దూలనా గాద్యాః పుంసి శ్రేష్ఠార్థగోచరాః అను నియమముచే నిచ్చట వృషభశబ్దము శ్రేష్ఠవాచకము) అభిహిత=పలుకఁబడిన, మహాభారత= మహాభారతమునందలి, శబ్ద=శబ్దములయొక్క, నిరూపిత=నిశ్చితమగు, అర్థము=అభిప్రాయము

(19) బుద్ధి,బాహు,విక్రమములన్=బుద్ధియనుబాహుబలముచే, దుర్గమ= తెలిసికొనరాని(చొరరాని)అర్థ=అర్థమనెడు, జల=నీటియొక్క, గౌరవ= గౌరవముగల, భారత, భారతీ, సముద్రము=భారతవాణియనుమున్నీటిని - దుర్గమత్వాదులచే నిందు భారతభారతికిని సముద్రమునకును సామ్య మార యునది. విధాతృనకున్=బ్రహ్మకు-(ఋ)విధాతకు-సూ-విధాతృ, ధాతృ, దాతృ, సవితృ, నేతృ శబ్దంబులకు మహత్తుల కత్వస్త్రీవద్భావంబులు విభాష నగు — బాల. వ్యా.

(21) హరి, హర, అజ, గజానన, అర్క, షట్ఆస్య, మాతృ, సర స్వతీ, గిరిసుతా, ఆదిక, దేవతా, తతికిన్=విష్ణువు, శివుఁడు, బ్రహ్మ, వినాయకుఁడు, సూర్యుఁడు, కుమారస్వామి, లోకమాతయగు లక్ష్మి, సర స్వతి, పార్వతి, మున్నగాఁగల, దేవతా, సమూహమునకు — ఇందు హర, అజ, భార్యలలో వ్యత్యయము చింత్యము — లేదా—క్రమ మవివక్షి తము — పద్యవిద్యకున్, ఆద్యున్=పద్యకవిత్వమునకుఁ బ్రథమకుని — వాల్మీకి ఆదికవియని భావము. "మనుమయఫణితీనాం మార్గదర్శీ మహర్షిః" అని భోజుఁడు.

(22) భారత,భారతీ, శుభ, గభస్తి, చయంబులన్=భారతవాక్కులను మంగళకరము లగుకిరణసమూహములచేత, ఘోర, సంసార, వికార, సంత

మస జాల, విజృంభము=భయంకరము లగుసంసారవికారము లనుకటికి చీకటుల మొత్తములయొక్క-గర్వమును, సూరిచేతః, రుచిర,అబ్జ, బోధన, రతుఁడు=పండితుల మనస్సు లనెడు అందము లగుపద్మముల వికసింపఁ జేయుటయందు ఆసక్తికలవాఁడు, పరాశర,ఆత్మజ, అంభోరుహమిత్రున్ = వ్యాసుఁడను సూర్యుని—ఇందు "పరాశరాత్మజాంభోరుహమిత్రుఁగొల్చి" యని వ్యాసవిశేషణముల సమాప్తిఁగావించి తిరిగి "మునిపూజితు భూరి యశోవిరాజితున్" అని విశేషణంబుల గ్రహించుటంజేసి సమాప్తపున రాత్తదోషలక్షణము పట్టినను ఉత్థితాకాంక్షమగు సమాప్తపునరాత్తము దుష్టముకాదని యెఱుంగునది.

(23) పరమ=శ్రేష్ఠమగు, వివేక=తెలివియను, సౌరభ=గంధముచే, విభాసిత=ప్రకాశింపఁజేయఁబడిన, సత్=మంచి, గుణ=గుణములయొక్క-, పుంజ=సమూహమను, వారిజ= (నీటిలోఁబుట్టినవి) కమలములయొక్క-, ఉత్కర=సమూహముచే, రుచిరంబులు=అందములయినవి-సకల=అందఱిచే, గమ్య=పొందఁదగిన, సుతీర్థములు=మంచిశాస్త్రములు అను రేవులు గలవి (శ్లిష్టరూపకము) సత్=సజ్జనులయొక్క-, సభా=సమూహములయొక్క-, అంతర=హృదయములు అను, సరసీవనంబులన్=కొలఁకులసమూహములను.

(24) పాకశాసనికిన్=అర్జునునకు (అపత్యార్థకతద్ధితము) ధరా,అమర, వంశ, విభూషణుండు=బ్రాహ్మణవంశమునకు అలంకారమువంటివాఁడు, వాఙ్మయ, ధురంధరుఁడున్=భాషయందు సమర్థుఁడు.

(25) నానా=నానావిధములగు,రుచిర=అందములయిన,అర్థ=అర్థములు గల,సూక్తి = సుద్దులకు, నిధి = గనివంటివాఁడు, జగత్ హితంబు=లోకోప కారము—ఈపద్యమువలన నన్నయభట్టునకుఁ బూర్వమును గవులు కలరని తెలియనగు.

(27) కులపతి=పదివేలమందిమునులకు అన్నవస్త్రాదు లొసఁగి యధ్య యనము చేయించువాఁడు. శ్లో॥ మునీనాం దశసాహస్రం, యోఽధ్యాప యతి హి ద్విజః। అన్నవస్త్రాదిదానేన, సవై కులపతిః స్మృతః॥ మొగిన్=పూనికతో, మునినికాయము=మునిసమూహము.

(29) హృద్యము = హృదయమునకు ఇష్టము, ఎఱుక = జ్ఞానము, అఘ, నిబర్హణము=పాపమును బటాపంచలుచేయునది.

(31) విశ్వజనీనము=ఎల్లజనులకు హితమైనది.

(33) అర్థఅర్థులకున్=ధనమును గోరువారికి. భవభయంబులు=సంసార మువలని భయములు.

(37) పండిత, చేతః, నిర్వృతిన్=పండితుల మనస్సునకు ఆనందమును.

(41) సర్వ, మనోజ్ఞము=ఎల్లరమనస్సునకును ఇంపైనది.

(45) పంచి=నిండి

(51) నవ్య, అర్థ, రమణీయము=క్రొత్తఅర్థములచే రమ్యమైనది.

(55) కృపాయితము=కృపవలెనాచరించునది. ఇటధర్మధర్ముల కభేదోప చారముచేఁ గరుణరసమున కాటపట్టైనది యనితాత్పర్యము—లేదా—"కృపా యతము, కృపాయుతము" అనుపాఠములనైనను గ్రహింపవలయును—

(65) అమిత,ఆఖ్యానక,శాఖలన్=పెక్కుకథలు అనుకొమ్మలతో, వేదార్థ,అమల,ఛాయము,=వేదార్థము అనుమంచినీడ గలది, సు,మహత్, వర్గచతుష్క,పుష్ప,వితతిన్=యోగ్యములగు గొప్ప ధర్మార్థకామమోక్ష ములు అను పుష్పసమూహముచే, కృష్ణఅర్జున, ఉత్తమ,నానా,గుణ,కీర్తన, అర్థ,ఫలము=కృష్ణార్జునులయొక్క శ్రేష్ఠంబులగు పెక్కుగుణంబులను జెప్పు నుట యనువస్తువే ఫలముగాఁగలది.

(69) రోష, ఆహత, అన్యోన్యము=రోసముచేఁగొట్టుకొనఁబడిన యొండొరులుగలది. ఈడక్షోవక=వెనుదీయక, అష్టాదశాహంబులక్=పదునెనిమిదిదినములును ("ద్విగు రేకవచనమ్" అని నియమముండినను గవులు బహువచనమునందును బ్రయోగించుచున్నారు)

(71) సాత్యవతేయవిష్ణుపదసంభవము = వ్యాసుఁడను ఆకాశమునుండి పుట్టుకగలది, విబుధేశ్వర,అబ్ధి,సంగతి, ఉపశోభితంబు=దేవతలకుఁ బ్రభువగు శ్రీకృష్ణుఁడను సముద్రినితోడి కలయికచేఁ బ్రకాశించునది. భారతీయ=భారతసంబంధియగు, భారతీ=వాక్కు అను, అమరఆపగా=ఆకాశగంగయొక్క, ఓఘము=ప్రవాహము.

(75) తనహృత్ వనజంబునక్=తనహృదయపద్మంబున

(77) ఇంబు,కక్=ఇంపుగా, తవిలి=పూని, కరంబు=మిక్కిలి

(78) ఉద్ధత=అధికమయిన, మద=మదముచే, అంధీభూత=గుడ్డివారైన, విద్వేషి=శత్రువులనెడు, జీమూత=మేఘములకు, ఉగ్ర=భయంకరమైన, శ్వసనుండు=వాయువువంటివాఁడు, దీర్ఘ=పొడవైనదియు, నిర్ఘాత=పిడుగువలె, కూర్గ=కూర్రమైన, కుఠార=గండ్రగొడ్డలిచే, లూన=నఱకఁబడిన, నిఖిల=సమస్తమయిన, క్షత్రి=క్షత్రియులను,ఉరు=గొప్ప,కాంతారుఁడు = అడవికలవాఁడు.

(80) వారణము=ఏనుఁగు, తురగముల్=గుఱ్ఱములు (త్వరగానేగునవి) కాల్వురున్=కాల్బలమును, త్రిగుణంబు=మూఁడురెట్లు, "ఐ, నిరంతరప్రమాణసంఖ్య" ఇట నుభయప్రాసము. ఈప్రయోగ మాధారముగా నన్నయభట్టు నణప్రాస మంగీకరించెననుట సాహసము.

(82) ప్రతిహత,శత్రు, విక్రముఁడు=కొట్టఁబడిన శత్రువులపరాక్రమము కలవాఁడు, అవద్య విదూరుఁడు=దోషములకు దూరమైనవాఁడు, ఉత్తమస్తుతమతి=ఉత్తములచేఁ బొగడఁబడిన బుద్ధికలవాఁడు,

(83) దేవశుని=దేవతయగు ఆడుకుక్క, కుక్కరకుమారుండు=కుక్క పిల్ల, సారమేయున్=కుక్కను.

(85) అనిమిత్త ఆగమంబులు=కారణములేనిరాకగలవి

(86) అన్వేషించుచున్=వెదకుచు

(89) సుర, ధారుణీసుర, ఆమ్నాయమున్=దేవతలయొక్కయుబ్రాహ్మణులయొక్కయుసమూహములు

(91) పంకజభవ సన్నిభుఁడు=బ్రహ్మతోఁదుల్యుఁడు, అఘ=, పాపములను, పంక=బురదను, క్షాళన=కడుగునట్టి మహత్=గొప్ప, తపః=తపస్సు అను, సలిలుఁడు=నీరుకలవాఁడు

(93) మహత్ + ఉత్కంబున్=గొప్పయెద్దును,

(94) ఏను=నేను

(100) నవ్య, నవనీత, సమానము= క్రొత్తవెన్నవంటిది, దారుణ, అఖండల శస్త్ర, తుల్యము=భయంకరమగువజ్రాయుధముతోసమానము, విపరీతము= తలక్రిందు

(102) విషధరపతి=సర్పరాజు (తక్షకుఁడు)

(104) బహు=పెక్కు, వన=అడవులచేతను, పాదప=చెట్లచేతను, అబ్ధి= సముద్రములచేతను, కులపర్వత=కులపర్వతములచేతను, పూర్ణ=నిండినదియు, సరః=కొలఁకులతోడను, సరస్వతీ=నదులతోడను, సహిత=కూడిన, మహత్=గొప్ప, మహీభరము=భూభారమును, జలధిశాయికిన్=విష్ణువునకు, అహిపతి=సర్పరాజు, దుష్కృతఅంతకుఁడు=పాపములను అంత మొందించువాఁడు, అనంతుఁడు=శేషుఁడు

(105) ఉరగులన్=పాములను (బొమ్మతోఁబ్రాకువారు) ఆనమత్= మ్రొక్కుచున్న, సురఅసుర=దేవదానవులయొక్క, మకుట=కిరీటముల

యొక్క, అగ్రి=చివరలయందలి, రత్న=మణులయొక్క, రుచి= కాంతుల చేత, శోభిత=ప్రకాశింపఁజేయఁ బడిన, పాదునకున్=పాదములుకలవానికి

(106) విపుల=అధికమగు, ప్రతాప = పరాక్రమముచే, సంభావిత= గౌరవింపఁబడిన, శక్తి=శక్తియు, శౌర్యులక్=శూరత్వముగలవారును, అపార=అంతములేని, విష=విషముచే, ఉత్కట=అధికమైన, కోప=కోప మనెడు, విస్ఫురత్=మండుచున్న, పావక=అగ్నిచే, తాపిత=తపింపఁజేయఁ బడిన, అఖిల విపక్షులు=సమస్తశత్రువులుకలవారు

(107) నికుంజములన్=పొదరిండ్లయందు, విపినంబులన్=అడవులయందు, ప్రకామగతిన్=స్వేచ్ఛావిధమున, ఈక్షణశ్రోత్రవిభుండు= (కన్నులేచెవు లుగాఁగల) పాములరాఁడు

(111) తత్=ఆ, అశ్వ=గుఱ్ఱముయొక్క, అఖిల=సమస్తములైన, స్రోతః =ఇంద్రియములయొక్క, మార్గ=ద్వారినుండి, వినిర్గత=బయలు వెడలిన, ఉగ్ర= భయంకరములగు, దహన=అగ్నియొక్క, అర్చుల్=మంటలు, కల్పాంత= ప్రళయమునందు, సంజాత=పుట్టిన, ప్రోద్ధత=అధికమగు, బాడబఅనల= బడబాగ్నియొక్క, శిఖా=జ్వాలవలని, శంకా=భయముకంటె, అధిక= ఎక్కువ, ఆతంకము=భయము కలది.

(118) ద్వాదశఅరంబులు=పండ్రెండు ఆకులు, అమృతఅశివి=అమృత మును ద్రాగినవాఁడవు.

(121) పర, ఆత్మ, విశేష, వివేక, శూన్యుఁడు=ఇతరులయొక్కయుఁ దన యొక్కయుఁ దారతమ్యముయొక్క జ్ఞానములేనివాఁడు

(123) భుజగజాల్మ్ముఁడు=నీచుఁడైన తక్షకుఁడు అసహ్యా=ఓర్వరాని, విష=విషము అను, ఉగ్ర=భయంకరమగు, ధూమకేతన=అగ్నియొక్క, హతిక్=దెబ్బచే, కృతాంత, నికేతన, అతిథిక్=యమునియింటికి అతిథిని

(124) హుతవహ=అగ్నియొక్క, ఉగ్ర=భయంకరములగు, సమగ్ర=నిండు, శిఖా - మంటలయొక్క, చయంబులన్=సమూహములందు.

(125) ప్రల్లదుండు=దుష్టుండు

(127) అప్రతిహన్యమానవీర్యము=ఎదురింపఁబడనిబలము, ఉదగ్ర, పావక, శిఖా, తతులన్=పైకెగయు నిప్పుమంటలసమూహములందు.

(129) ఒయ్యన్=తిన్నగా. అనృత, అభిభాషణమునన్=అబద్ధములాడుటవలన,

(131) సముదిత=ఉదయించిన, సూర్యసహస్ర=వేయిమందిసూర్యులతో, ఉపమ=పోలిక్కగల, దుస్సహ=ఓర్వరాని, తేజున్=తేజస్సుగలవాని. జగత్=లోకములయొక్క, ఉపప్లవసమయ=ప్రళయకాలమునందలి, అసమ=ఈడులేని, దీప్తి=ప్రకాశముగల, తీవ్ర=తీక్ష్ణమైన, పావక=అగ్నితో, సమున్=సాటియగువాని. భస్మసాత్కృతుఁడు =బూడిదఅధీనమైనవాఁడు

(142) అనవద్యగుణుండవు=దోషములేనిగుణములుకలవాఁడవు, భువన, ప్రవర్తన, పరాఙ్ముఖభావమున్=లోకముల నడపుటయందుఁ బెడమొగముగలిగియుండుటను

(148) నిర్విషము=విషములేమి

(149) విషవ్యపగతము=విషమునుండితొలఁగినది,

(151) చిక్కనిదండము=లావుకఱ్ఱ,

(157) సర్వ, భూత, హిత, సంహిత, బుద్ధియున్=ఎల్లప్రాణులయొక్క మేలునందే కూర్పఁబడినబుద్ధియును, మానమదప్రహాణమున్=మానముయొక్కయు మదముయొక్కయు విడుదల,

(161) విభ్రాజిత=ప్రకాశించుచున్న, శుభ్ర=తెల్లని, కీర్తి=కీర్తిచే, పరిపాండుర=తెల్లనైన, సర్వ=సమస్తములయిన, దిక్=దిక్కులయొక్క, అంతరాళ=నడిమిప్రదేశముకలవాఁడా! ఘోర, ఆజి=భయంకరములగు యుద్ధ

ములయొక్క, ముఖ=ప్రారంభమునందే, ఉపలబ్ధ=పొందఁబడిన, విజయ ప్రమదా=జయలక్ష్మిచే, శ్రిత=ఆశ్రయింపఁబడిన, బాహుదండ=దండములఁ బోలు బాహువులుగలవాఁడా! మృడప్రియ=ఈశ్వరుఁడే యిష్టుఁడుగాఁ గలవాఁడా! లేదా ఈశ్వరునకు నిష్టుఁడా!

---

# ద్వితీయాశ్వాసము

(1) నానా అవనినాథ=పెక్కు దేశముల రాజులయొక్క, కిరీటతటీ=కిరీటప్రదేశములయందు, విలసత్=ప్రకాశించుచున్న, రత్న=రతనములచే, సంఘటిత=కూర్పఁబడిన, పదకమలాః=పాదపద్మములు కలవాఁడా!

(3) అనలతేజులు=అగ్నియొక్క తేజమువంటి తేజముగలవారు, కడింది వీరులన్=గొప్పశూరులను

(10) తనర్పు=ఎత్తు, ఆర్జవంబు=వంకరలేమి, కుధరంబు=కొండ,

(11) యోక్త్రంబు=కవ్వపుఁద్రాడు

(12) పూర్వగీర్వాణవ్రాతము=రాక్షసులగుంపు, తత్=వారిచే, వ్యాకృష్ట=లాగఁబడిన, నాగ=సర్పము (వాసుకి)యొక్క, ఆనన=ముఖములయొక్క, శ్రేణీ=బారునుండి, ప్రోత=బయలువెడలిన, విష=విషమునెడు, అగ్ని=అగ్నియొక్క, ధూమవితతుల్=పొగలమొత్తములు. పయోద ఆవలిన్=మేఘమాలను

(13) తత్ పుచ్ఛమున్=ఆ వాసుకి తోఁకను.

(14) మృడుఁడు=ఈశ్వరుఁడు, గళంబునన్=కంఠమునందు.

(21) ఉరుతర=మిక్కిలి గొప్పవైన, శర=బాణములయొక్క, పక్ష=ఱెక్కలవలన, జాత=పుట్టిన, వాత=గాడ్పుయొక్క, రయ=వేగముచే, విధూతము=ఎగురఁగొట్టఁబడినది. ఉదిలకొనన్ కన్—పరితపింపఁగా

(22) కోదండ, చక్ర, ఉద్యత, భుజుల్ = ధనుస్సుతోను, చక్రముతోను, ఉద్యమించినచేతులుగలవారు. దుర్వార = వారింపరాని, వాత్యా = వాయుసమూహముయొక్క, రయమునన్ = వడిచే,

(23) శర, చాప, ప్రవిముక్త, దారుణ, బృహత్, నారాచధారల్ = శరమహార్ఙ్గి ధనుస్సునుండి విడువఁబడినభయంకరములగుగొప్పబాణముల సమూహములు,

(24) నాకద్విషత్ = రాక్షసులయొక్క, మస్తకపరితతుల్ = తలల మొత్తములు

(28) అలఘు = గొప్ప, ఫణీంద్రలోక = పాఁపఱేనిజగమను, కుహర = రంధ్రముయొక్క, అంతర = లోన, దీప = దీపములవంటి, మణి = రత్నములయొక్క స్ఫురత్ = ప్రకాశించుచున్న, ప్రభా = కాంతులయొక్క, ఆవళి = సమూహము.

(30) వివిధ = పెక్కువిధములగు, ఉత్తుంగ = పెద్ద, తరంగ = అలలయొక్క ఘట్టన = తాఁకుడుచే, చలత్ = కదలుచున్న, వేలా = చెలియలికట్టయందలి, వన = వనమునందలి, ఏలాఆవళీ = ఏలకితీఁగెలసమూహముయొక్కయు, లవలీ = లతావిశేషములయొక్కయు, లుంగ = మాదిఫలవృక్షములతోను, లవంగ = లవంగవృక్షములతోను, సంగత = కూడిన, లతా = తీఁగెలయొక్క, లాస్యంబులు = ఆటలు, అవదాత = తెల్లని, అంబుజ = తామరలతోను, ఫేనపుంజ = నురుఁగులగుంపుతోను, నిభుఁడ = సమానమైన

(36) పంచత్వము = మరణము

(38) ఆతత = విశాలములైన, పక్ష = ఱెక్కలయొక్క, మారుత = గాలియొక్క, రయా = వడిచే, ప్రవికంపిత = కదల్పఁబడినదియు, ఘూర్ణిత = కలఁచఁబడినదియునగు, అచలవ్రాత, = కొండల సమూహము, మహత్ అర్ణవుండు =

పెద్ద సముద్రములుఁ గలవాఁడు - ఇక్కడ గాలిచేఁ గొండలు కదల్పఁబడెనని యు, సముద్రములు కలఁచఁబడెననియుఁ గ్రమాలంకారము చేకొనవలయును.
బలవత్=బలముగల, నిజ=తన, దేహ=దేహముయొక్క, సముజ్జ్వల=మిక్కిలి ప్రకాశించుచున్న, ప్రభా=కాంతిచేత, ధూత=చెదరఁగొట్టఁబడిన, పతంగ=సూర్యునియొక్క, తేజుఁడు=కాంతిగలవాఁడు

(39) దారుణ, కల్పాంత, మరుత్, ప్రేరిత, హవ్యవహ, శిఖల పెల్లు= భయంకరమగు ప్రళయమునాఁటి గాడ్పుచేఁ బురికొల్పఁబడిన అగ్నిజ్వాలల యొక్క యతిశయము

(41) హరి, కులిశ, క్షతి=ఇంద్రునివజ్రపుదెబ్బను,

(42) ఇడుగడ=అసూయ, మడవక=వెనుదీయక

(48) ఆయత, పక్ష, తుండ, హతిన్=నిడుపులగు ఱెక్కలయొక్కయు, ముక్కుయొక్కయు దెబ్బచేత, "పయోరుహాననా" ఇటనవయవార్థము అవివక్షితము. వివక్షితమేని ఔచిత్యభంజకము. ఎవఁడేనియుఁ దల్లినట్లు సంబోధించుట యసమంజసముకదా.

(65) సుఖము + ఉన్నన్ (సుఖముతో నుండఁగా) నా—ఒకానొకచో నొకవిభక్తికి మఱియొక విభక్తి యగు—బాలవ్యా. కారక—అనుఁ న్నుఁడు= తమ్ముఁడు

(70) కనకప్రతతీపతతులన్=బంగారుతీఁగెలసమూహములతో.

(74) మహత్, జవ, నిర్జిత, ప్రభంజనున్=గొప్పవేగముచే జయింపఁబడిన వాయువుగలవానిని, దీప్త, హవ్యవాహన, సమున్=మండునగ్నితో సమానుఁడైనవానిని

(77) హిమశైలకందరాభాగముకడన్=మంచుకొండయొక్క గుహాప్రదేశముదగ్గఱ, నిష్పురుషనగము హిమవద్గుహాసమీపమున లేమింజేసియిట నేశవిరోధము నుదోపఁబు వాటిల్లును. కనుక "హిమరుద్ధకందరాభాగముకడ"

అనుసారమే గ్రాహ్యము- దీనికి మూలమును సంస్కృతభారతమున నిట్లే యున్నది.

శ్లో॥ తతో నిష్కురుషం శైలం । హిమసంరుద్ధకందరమ్॥ దుమశాఖల్= చెట్టుకొమ్మను,

(79) ఘన, పక్ష, అనిల, చలిత అవనిరుహములవలనఁ= పెద్దరెక్కల వలనిగాడ్పులచేఁగదలింపఁబడినచెట్లవలన, అనిమిషజయార్థము=దేవతలమీఁదికి గెలుపుకొఱకు,

(81) అంగారవృష్టుల్=నిప్పులవానలు, కులిశధారల్ కుంఠితంబయ్యెఁ- ఇందు విశేషణంబగు "కుంఠితంబు" అనుపద మేకవచనంబున నుండుట దోషంబు కాదు—సూ—స్త్రీసమంబులగువిశేషణంబులయు, ముపర్ణకాంతవిశేషణంబులయు బహువచనంబున కేకవచనంబు బహుళంబుగానగు. బాలవ్యాకరణ.

(89) కృష్ణ, అరుణ, సిత, పీత, ఘనతర, అంగత్రాణముల్=నలుపు, ఎఱుపు, తెలుపు, పసుపు, లగుమిక్కిలిగొప్పకవచములుగలవారు.

(91) వితత, ఉల్కా, అశని, పుంజము=విరివియగు కొఱవులయొక్కయు పిడుగులయొక్కయుసమూహము, విక్షిప్త, పక్షతి, వాత, అహతిఁ=విదుర్చఁబడిన రెక్కలమొదళ్లయొక్కగాలిదెబ్బచేత. తూల, శకల ఆకారంబుల= దూదిముక్కలంతఆకారములుగలవి,

(93) కల్పాంత, అనల, కీలా, కల్ప, ఆయత, పక్షుఁ=ప్రళయకాలమునందలి అగ్నిజ్వాలలతోసమానము లగువిశాలములైన రెక్కలు కలవానిని, శౌర్యఆకల్పుఁ=శౌర్యమే భూషణముగాఁగలవానిని

(94) కడిమిమెయిఁ=పరాక్రమముతో

(97) ఉదగ్ర=భీకరములగు, జ్వలన=అగ్నియొక్క, జ్వాలా= మంటలచే, అవలీఢ,=మ్రింగఁబడిన, శిలధనువు+అ=మిడుత,

(99) వసు,హీన,విప్రుల,క్రియఁ=డబ్బులేనిబ్రాహ్మణులవలె, దక్షిణాశ్రితులు=దక్షిణదిక్కు నాశ్రయించినవారు,దక్షిణలను ఆశ్రయించినవార నియు నర్థాంతరము. కాందిశీకులు=భయముచేఁబాఱినవారు.

(100) రేణు,క్రథన,ప్రలిహ,ప్రరుజ,అశ్వకృంత, పదనఖులు, అనుగఖులన్=పై పేరులుగలయమృతరక్షకులను, కులిశ=వజ్రమువలె, నిశాత=వాఁడియైన, నఖ=గోళ్లయొక్క, ఆవలిన్=సమూహముచే, వ్రచ్చివందఱలాడెన్=చించిచెండాడెను.

(102) దీప్త=ప్రకాశించు, విద్యుత్=మెఱపులవలెను. ఉల్క=కొఱవులవలెను, అరుణ=ఎఱ్ఱని, దారుణ=భయంకరములగు, అక్షులు=కన్నులుగలవి.

(104) తెక్కలికొని=దొంగిలించుకొని

(110) అమరుఁడవు=చావులేనివాఁడవు, అజరుఁడవు=ముసలితనములేనివాఁడవు, అజితుఁడవు=ఓటమిలేనివాఁడవు,

(114) బృహత్,నిజ, పక్ష,సమీరణంబునన్=పెద్దవియగునా ఱెక్కలగాలిచే,

(119) కరి=సాక్షి

(125) వారితోడిపొత్తు=వారలతోఁగూడుసహవాసము; వారితోడన్ + పొత్తు. సూ—చేత,తోడ,వలనల కిత్వంబు సమాసంబులందగు-బాల.సంధి.

(128) దుర్భర=సహింపరాని, దందశూకకుల=సర్పజాతియొక్క. భావి=కలుగఁబోవు, భయ=వెఱపునకు, ప్రతిఘాత=ప్రతీకారరూపములగు, కృత్యముల్=పనులు.

(139) దారపరిగ్రహము=పెండ్లి, సంసార,పునర్,భవ,భీతిన్=సంసారమునందలి తిరిగి పుట్టువులని వెఱపుచే, అపార,వ్యామోహ, బంధ, పాశ, చ్యుతుఁడు=అంతములేని మోహబంధమనెడు త్రాటినుండి జాఱినవాఁడై.

(141) అధఃముఖ విప్రిల్=క్రిందు మొగములగల బ్రాహ్మణులు.

(142) అనుపమదుష్కృతులము=సాటిలేని పాపముకలవారము.

ఈపద్యంబున 'లేకను' అను పదము జూచి వ్యతిరేకక్త్వార్థకము దుగ్రితాంతముగా నుండవచ్చునని భ్రమింతురు. 'లేమిని' అనిగాని, 'లేదని' అనిగాని, కవికృతపాఠమై యుండవచ్చునని కొందఱు తలంతురు. కొందఱు 'లేక + అను సంతానచ్ఛేదంబున' అని విఱిచి యెట్లో యర్థంబుచెప్పికొని పైదోషంబును వారింతురు.

(146) మీరలు నాపితృదేవతలరు. సూ—ప్రథమాంతంబులగు యుష్మదస్మద్విశేషణంబుల కేకత్వంబున వు-ను-లును బహుత్వంబున రు-ము-లు నంతాగమంబులగు. సూ—ఈయాగమంబులు పరంబులగునపు డుత్వంబున కత్వంబగు.

(151) శిరల్=నరములు.

(153) ఒందెన్=కలిగెను. ఒందుధాతు వకర్మకముగ గలదు.

(155) వాలుపయిన్=కత్తిమీఁద, నియమఅభీలుఁడు=తపముచే భయంకరుఁడు.

(158) పదరున్ ఓ=పరుషములాడు నో, అవజ్ఞ=అవమానము.

(161) అపాకృత, భవ, అనుబంధుఁడు=తొలఁగింపఁబడిన సంసారబంధముగలవాఁడు.

మాతాపితృ=ద్వంద్వసమాసమునందు విద్యాయోని సంబంధవాచకంబులగు ఋకారాంతశబ్దములకు ఉత్తరపదము పరముగునపుడు ఆనజ్ దీర్ఘము వచ్చును.

(162) చ్యవనసుతుఁడైన ప్రమతితోఁ దివె — ఉపయోగంబునం దాఖ్యాతకుం దోడవర్ణకం బగు-బాలవ్యా. కారక.

(166) పృథ్వీవృత్తము—అమితప్రమదభేది యొకరుఁడు యమ్మృగాన్వేషణ-సంస్కృతభాషయందుఁ బృథ్వీవృత్తమునకు నవమాక్షరము యతి

స్థానముగాఁ బరిగణింపఁబడినను ఆంధ్రమునందుఁ బురాణకవులుమాత్రము పండ్రెండవయక్షరమునే యతిస్థానముగా వాడిరి. అదికారణముగా లాక్షణికులు "జసల్ జసయవంబు లుష్ణకరసంఖ్యవిశ్రాంతులున్ (అప్పకవి) అని శాసించిరి. ప్రబంధకవులుమాత్రము సంస్కృతచ్ఛందోనుసారముగా నవమాక్షరమునే యతిస్థానముగా వాడుచువచ్చిరి. పైఅప్పకవిలక్షణమును బట్టి ప్రబంధకవులపృథ్వీవృత్తము లక్షణవిరుద్ధమని భ్రమింపరాదు.

(168) అవంధ్యకోపి=వ్యర్థముకానికోపముగలవాఁడు. ఇచట,బహువ్రీహిచేతనే తదర్థము సిద్ధమగునుగానఁ గర్మధారయసమాసముకంటె మత్వర్థీయము కూడదనునియమము పాటింపఁబడలేదు.

(184) ఉరగ=పాములయొక్క, విష=విసముచే, అపేతజీవ=పోయినప్రాణముగలవారిని, సంజీవన=బ్రతికించు, ఉపదేశంబు=మంత్రము.

(188) అరిందముఁ=శత్రువుల నణఁచువానిని.

(191) విపుల,పత్త్ర,దీర్ఘ,విటప,తతులఁ=విశాలములగుఆకులయొక్కయు, పొడవులగు కొమ్మలయొక్కయు సమూహములచే.

(193) ఇంధనార్థము=చిదుగులకొఱకు.

(195) ఋగ్యజుష పదక్రమంబులు=ఋగ్వేదముయొక్కయు యజుర్వేదముయొక్కయు పదములను, క్రమములను, ఋగ్యజుష—ఋక్కులు, యజుస్సులు, ఋగ్యజుషము—సమాసాంతమగు అ(చ్)ప్రత్యయము. భావజసుభగుండు=మన్మథునివలెనందగాఁడు.

(196) తత్=ఆ, వన్య=వనములోని, ఫల=పండును, జిఘత్సాఅపేక్షఁ=తినుటయందలియిచ్ఛచే—"జిఘత్సా" అనుసన్నంతముచేతనే తినుటయందలియిచ్ఛ యనునర్థము వచ్చునుగాన అపేక్షఁ అనివేఱుగా గ్రహించుట పునరుక్తమువలెఁ గన్పట్టెడిని.

(198) సూరెలన్=పార్శ్వములయందు, అనవద్యుఁడు=దోసములులేని వాఁడు.

(205) ఉగ్ర, హవ్యవాహన, శిఖలన్=భయంకరములగు అగ్నిజ్వాలల యందు.

(213) ఉదాత్త=గొప్ప, అశీ=కోఱలయందు, విషఅగ్నుల్=విషాగ్ని గలవారు. నవ,అసృక్,రక్త, నేత్రిల్=క్రొత్తనెత్తురుచే నెఱ్ఱనికన్నులు కల వారు. ఏక,త్రిక,పంచ,సప్త,నవ,నానామస్తకుల్=ఒకటి, మూఁడు,అయిదు, ఏడు,తొమ్మిదియు,నగు పలుతెఱఁగులతలలు కలవారు.

(218) ప్రస్తుత,ఫణి,సత్రి,భయ,త్రస్త,ఆత్ములము= ప్రస్తుతమగుసర్ప యాగమువలనిభయముచే వెఱచినమనస్సుగలవారము, స్వస్తి=శుభము.

(223) రజనీనాథ,కుల,ఏక,భూషణుఁడవు=చంద్రవంశమునకు ముఖ్యా లంకారుఁడవు.

(226) వితత, మఖ, ప్రయోగ, విధికృత్, తములు=విరిమైః, యజ్ఞ ప్రయోగములయొక్క యనుష్ఠానములను బాగుగా నెఱింగినవారు.

(227) సత్ = సజ్జనులచే, వంద్యుఁడు=నమస్కరింపఁదగినవాఁడు.

(228) ఆర్త్రిహర, క్రియా, అభిరతుఁడు=దుఃఖములఁ బోఁగొట్టుపనుల యందు ఆసక్తికలవాఁడు. ప్రదక్షిణ,ఆవర్త, శిఖా, అగ్ర, హస్తములన్= ప్రదక్షిణముగాఁ దిరుగు జ్వాలలయొక్క చివరలు అను చేతులతో.

(230) శాంత, మన్యు, సంతానుఁడవు = అణిఁగినకోపసమూహము కల వాఁడవు. ఉపరతంబు-కన్=అంతమందునట్లు.

(233) వాత్యా, రయ ఉద్ధతిన్=వాయుసమూహముయొక్క వేగాతి శయముచే, ఉద్ధూత, వివర్ధిత, ఆయత, బృహత్, దావాగ్నిపోలెన్=ఎగురఁ గొట్టఁబడినదియు, వృద్ధిచెందినదియు, విశాలమైనదియు, పెద్దదియు నగు కార్చిచ్చువలె.

(285) సర్వయోగనిమిత్త=సర్వయోగనే కారణముగాఁగల, ఉద్ధత=గర్వితమగు, మృత్యు=మృత్యుదేవతయొక్క, వక్త్ర = నోటిని, గతులన్ = చొచ్చినవారిని.

---

# తృతీయాశ్వాసము.

(1) ధైర్య,అమర,ధరణీధర=ధైర్యమునందు వేల్పుఁగొండవంటివాఁడా! ధరణీమండన=భూమికి అలంకారమైనవాఁడా!

(3) పరమబ్రహ్మనిధిన్=ఉత్తములగు వేదములకు గనివంటివానిని—లేదా—ఉత్తమమగు బ్రహ్మజ్ఞానమునకు గనివంటివానిని, నీల, అంబుద, వర్ణ, దేహున్=నల్లని మేఘముయొక్క వన్నెవంటివన్నెగల దేహముగల వానిని, అనురూప, ప్రాంశున్=ఆకారమునకుఁ దగినంతపొడవైనవానిని, ఉద్యత్,దివాకర,రుక్,పింగ,జటా,కలాపున్=ఉదయించుచున్న సూర్యుని యొక్క కాంతులవలెఁ బచ్చని జడలమొత్తము గలవానిని

(5) వీఁగి=గర్వించి, అపారపరాక్రముల్=అంతులేని బలముగలవారు, గోత్రకలహము=కులమునందుఁబోరు

(7) సమస్త, జనపాల, సభాజన, యోగ్యుని=ఎల్లరాజులపూజకుఁదగిన వానిని, వినతుఁడు=నమస్కరించినవాఁడు

(9) వాక్,మనః, కాయ, ప్రవర్తిత,అనేక,జన్మ,అఘ, నిబర్హణంబు=వాక్కుచేతను, మనస్సుచేతను, శరీరముచేతను జేయఁబడిన పెక్కుపుట్టువు లందలి పాపమును బోఁగొట్టునది—ఈసమాసపదమునందు "వాక్ + మనః" అను పదములకు ద్వంద్వమునందు సమాసాంతమగు అ(చ్)ప్రత్యయము రాఁగా "వాఙ్మనస"యగును. అట్లు నన్నయభట్టారకుఁడు చేసియుండ

లేదని కొందఱాక్షేపింతురు. అది పొరపాటు. వాక్శబ్ద మనశ్శబ్దము లకుమాత్రమే ద్వంద్వముచేసినప్పు డట్లు "వాఙ్మనస" అని కావలసినది యే కాని ఇచ్చట వాక్, మనస్, కాయశబ్దముల కగుబహుపదద్వంద్వముగాన ఆసమాసాంతవిధి ప్రవర్తింపదు. కనుకనే మహాకవి కాళిదాసుగారుగూడ "వాఙ్మనఃకర్మభిః పత్యౌ" అనిశ్లోకమునం బ్రయోగించియున్నాఁడు.

(10) ధృతవివేకులు=ధరింపఁబడినజ్ఞానము కలవారు, శరణఆగతఅను కంపనులు=శరణుచొచ్చినవారిపై దయఁజూపువారు.

(11) ఆయుష్యంబు=ఆయుస్సుకలిగించునది, లోక, ఆగమ, న్యాయ, ఏకాంతగృహంబు=లోకమునందలివియు, వేదమునందలివియు నగున్యాయ ములకు రహస్యమందిరము.

(12) ధృతరాష్ట్రునొద్ద, ధృతరాష్ట్రునియొక్క + ఒద్ద నూ-షష్ఠీసమాస మునం దుకారఋకారముల కచ్చు పరంబగునపుడు నుగాగమం బగు. బాల సంధి. "దుర్ణయమున శకునికర్ణదుశ్శాసనుల్" దురః షత్వణత్వయో రుప సర్గత్వప్రతిషేధో వక్తవ్యః=అనువార్తికముచే "దుర్నయ" అనియే కావల యును. కనుక ణత్వప్రాసము నన్నయగారి కభిమతమని కొంద ఱందురు. అది సరికాదు. నన్నయభట్టుగారీతావున నేదప్ప మఱియెచ్చటను ఈణత్వప్రా సము వాడియుండలేదు. 'దుస్' అనుఉపసర్గమీఁద దుర్ణయపదమును సిద్ధం బగుచుండ నీణత్వప్రాసము నన్నయపైఁ గట్టనేల? విస్తరము మదీయ శతలక్షణియందుఁ జూచునది.

(14) అక్కజము=ఆశ్చర్యము. ఉదిత, సత్య, రతులన్=అభివృద్ధిచెందిన సత్యమునందు ఆసక్తిగలవారిని.

(16) అరకన్ కన్=ఇంపుమున్నగుపదము నధ్యాహృతమొనర్చుకొని 'ఇం పారఁగన్' అనియన్వయింపనగు.

(18) పన్నగ, ఆభరణున్=పాములుసొమ్ములుగాఁగలవానిని

(19) "వేఁడికొనక=ఇదివేఁడికొనుధాతువునకు వ్యతిరేకక్త్వార్థకము

భ్రమింపరాదు. వేఁడి=(ధృతరాష్ట్రిని దమవృత్తుల)యాచించి, కొనక=కైకొనలేక

(21) అర్క,అంశు,ప్రకాశంబులోఁ=అర్కములుఅనుకిరణములకాంతితో. సాత్యవతేయ,ధీ,వనధి,జన్మ,శ్రీమహాభారత,ఆఖ్యాన,ఆఖ్య, అమృతసూతి=వ్యాసునియొక్క-బుద్ధియను,సముద్రమునందుఁ బుట్టకకల శ్రీమహాభారత కథ యను పేరుగలచంద్రుఁడు. నిఖిల,అఘు,ధ్వాంత,విధ్వంసి= సమస్త పాపము లనుచీఁకటిని పోఁగొట్టునది.

(23) నిర్వేదమునఁ=చింతతో (విసుగుతో) సన్యస్తశస్త్రుఁడు=వదలి వేయఁబడిన బాణములు కలవాఁడు

(27) కలికి కాన్గిల్లన్నుల తెలుపును=అందమైనచంచలనేత్రముల తెల్లందనమును. అలఘు,కాంచీపదస్థలములయొప్పును=గొప్పపిఱుందుల యొప్పిదమును. అళి=తుమ్మెదలవలె, నీల=నల్లనివియు, కుటిల=వంకరలైనవియు నగు, కుంతలముల కాంతియున్=ముంగురుల అందమును.

(29) ఆమిషము=మాంసము, ఖగము=పక్షి, (ఆకాశమున వెళ్లునది) వ్యోమమునన్=ఆకాశమున

(30) సునిశిత, తుండ హతిన్=వాఁడియగుముక్కు-పోటుచేత

(32) ఉదరదళనంబు=పొట్టచీల్చుటను

(36) అఘు, నాశన ఘోర, తపః,ధనుండు=పాపముల నశింపఁజేయుగొప్ప తపస్సే ధనముగాఁగలవాఁడు. తల + ఉదరిన్=శూన్యమగుపొట్టకలగానిని

(38) అన్నువకాఁడీఁగ యందంబు=సన్ననితీఁగవంటి నడుముయొక్క-చక్కఁదనంబు. వివిక్తము=ఏకాంతము

(42) అఖిల=ఎల్లవారియొక్క-. దృష్టిపథ=చూపుదారిని, రోధి=అడ్డగించు, నీహార=మంచుకలని, తిమిరము=చీఁకటిని

(43) పరమేష్ఠికల్పుఁడు=బ్రహ్మతోఁదుల్యుఁడు

(44) అహిమద్యుతి, తేజుండు=సూర్యునితేజస్సువంటితేజస్సుకలవాఁడు

(47) అంబురుహసంభవునంశము=బ్రహ్మయంశమును- వ్యాసో నా రాయణో హరిః అని శ్రీవేదవ్యాసులను నారాయణాంశముగా శాస్త్రములు వర్ణించుచుండ నిందు బ్రహ్మాంశముగాఁ జెప్పుటకుఁ గతమేమో ! నిఖిల, ఆగమ, పుంజములన్=సమస్త వేదములసమూహమును

(51) అపక్షత్త్రింబు=క్షత్త్రియులులేనిది, ధాత్త్రీతలం బపక్షత్త్రింబు సేసిన-ఇచ్చటఁ బ్రాసయతి. క్షతాత్ త్రాయతే ఇతిక్షత్త్రః" అనువ్యుత్పత్తిచే క్షత్త్రశబ్దములో 'త' కారద్విత్వము సహజముగా నుండుటంజేసి ప్రాస కనుకూలముగా ధాత్రీశబ్దంబునందును 'అనచిచ' అనుసూత్రముచే తకారద్విత్వము గావింపఁబడియె- ప్రాసస్థానంబుల ద్విత్వమువలసినపుడెల్ల నీసూత్రమే యాంధ్రకవులకు శరణము.

(55) జితకాశులు=జయముచేఁ బ్రకాశించువారు; ఇచ్చట జితశబ్దము భావేక్తప్రత్యయము

(56) సుర,విపక్ష,గణ,అంశ,జులు= వేల్పులకు విరోధులగురాక్షసుల సమూహముయొక్క అంశలవలనఁ బుట్టినవారు

(74) అపగతఖేదుఁడు=పోయిన దుఃఖముకలవాఁడు

(86) ఇద్ధ,యశః అర్థులు=ప్రకాశించుకీర్తిని గోరువారు

(90) మద, అంధ్యమ్మునన్=మదమనెడు గ్రుడ్డితనముచే

(93) చతుర్, అంభోధి, పరీత, భూవలయమున్=నాల్గుసంద్రములచేఁ జుట్టఁబడిన భూమండలమును. సద్వీప,స అరణ్య, సక్షితిభృత్కంబు= దీవెలతోఁగూడినదియు, అడవులతోఁగూడినదియు, కొండలతోఁగూడినదియు. నిర్జిత, అహితుఁడు=జయింపఁబడినశత్రువులు గలవాఁడు

(95) విషయ, ఉపభోగ, అభిలాషణము=విషయముల ననుభవించుటయందుఁగోర్కి

(98) జగత్, అను గ్రహ, నిగ్రహ, శక్తి, యుక్తుఁడు=లోకముల ననుగ్రహింపను, నిగ్రహింపను శక్తితోఁగూడినవాఁడు. కావ్యుఁడు=శుక్రుఁడు.

(104) యమసాదనమునకున్=యమమందిరమునకు

(112) వాఁడిమయూఖముల్ గలుగువాఁడు=వేఁడి కిరణములు కల వాఁడు- సూర్యుఁడనిభావము—ఇట్లు విశేషణమాత్రప్రయోగముచేతనే విశే ష్యమును స్ఫురింపఁజేయుటకవిత్వమునందొక మెఱుఁగు.సూ-విశేషణమాత్ర ప్రయోగోవిశేష్యప్రతిపత్తౌ-వామనాచార్యుఁడు. వోఁడి + కన్=చక్కఁగా

(116) వగవక=విచారింపక, అగణిత, గర్వమునన్=అధికమగుగర్వ ముతో

(121) పతితులు=చెడినవారు, మర్యాద=నియమము.

(125) ఉదర 'భిదా' ముఖమునన్=కడుపును జీల్చుటగుండ, భగ్న, హిమ, మయూఖుఁడు=నిండు చందురుఁడు

(129) భావజశక్తిన్=మన్మథునిసామర్థ్యముచే,

(135) ఆరాధ్యను=పూజింపఁదగినదానను,

(137) నానయుక్=సిగ్గును

(139) అధిజ్య=ఎక్కుడఁబడిన, ధనుః=విల్లే, సహాయుఁడు=తోడుగల వాఁడు. ఆనత, శాత్రవుండు=లొంగినశత్రువులు కలవాఁడు, నికాచు, పథి, శ్రముండు=మిక్కిలి మార్గాయాసము కలవాఁడు,

(140) విలసత్, కూల, ఘన, వల్లి=ప్రకాశించుచున్న, తీరమునందలి, పెద్ద, తీఁగ.అన్న + ఇష్టసఖి—సూ—అత్తునకు సంధి బహుళము—పన్నుగాన్= అధికముగా,

(142) గతభ్రములక=పోయినమూర్ఛగలవారిని,

(144) జలధి=సముద్రముయొక్క, విలోల=చంచలమగు, వీచి=అల యును,కల=అవ్యక్తధ్వనిగల, కాంచి=మొలనూలిచే, సమంచిత=ఒప్పుచున్న, అవనీతల=భూతలముయొక్క,వహన=మోయుటయందు, క్షమంబు=సమర్థ మయినది.తత్=ఆదేవయానియొక్క, ఉత్నమత్=పైకెత్తుచున్న, గళత్= జాఱుచున్న, ఉరు=గొప్ప,ఘర్మవారి=చెమటనీళ్లయొక్క, కణ=బొట్లచే, కమ్ర=మనోహరమైన,కరఅబ్జము=పద్మమువంటిచేతిని

(147) బన్నము=భంగము, ఎడన్=మనమునందు

(151) ఈవనరాశిలోన్=ఈసముద్రమునందు, అంతకకోపులు=యముని కోపమువంటికోపముగలవారు, దేవపతాకినీ, పతుల, దివ్య, నిశాత, మహత్, ఆయుధ, ఆహతిన్=దేవసేనానాయకులయొక్క దివ్యములును వాఁడివియు నగుగొప్పయాయుధములదెబ్బచే

(152) వారణఘోటక, భాండాగారములు=ఏనుఁగులుగుఱ్ఱములు, బొక్కసములు, వారకములు=దాఁచిపెట్టుకొన్నధనములు. వగవుము=తలంపుము

(156) అంగనాజనుల, ఉత్తుంగ, సంగత, కుచ, కుంకుమ, చందన, పంకముల యందున్=స్త్రీలయొక్క గొప్పవియు, క్రిక్కిఱిసినవియు నగు స్తనములయందలి కుంకుమముతోఁగూడినమంచిగంధపుబురదయొక్కయు, ఈపదములన్నియు గీతములోని "విలసితసౌరభావళులు" అనుపదముతో వ్యవహితమైనను అన్వయింపకతప్పదు. ప్రయోగవైచిత్ర్యము. ధమ్మిల్లభారఅవకలిత, దివ్యామోద, నవపుష్పదామములయందున్=కొప్పులందు, ఉంచఁబడినమంచిపరిమళముగల, క్రొత్తపూదండలయొక్కయు. ముఖ, సకర్పూరతాంబూల, అధివాసనా, సురభి, నిశ్వాసములయందున్= నోటియందలికప్పురముతోఁగూడినతాంబూలము మెలఁగఁగలవానియొక్క వాసనచేఁబరిమళించునిట్టూర్పులయొక్కయు. పరిధాన, చారు, ధూపములయందున్=వస్త్రములయొక్క మనోహరములగుధూపముల యొక్కయు. మృగతృష్ణన్=మృగములకైనఆశచేత-ఇందుమృగతృష్ణాపదమునకు రూఢ్యర్థమగు 'ఎండమావులు' అనుదానిని వీడి యోగికార్థమే గ్రహింపఁబడినది. క్వచిత్ యోగో రూఢి మపహరతి.

(160) నిగ్రహము=తిరస్కారము, విడన్=నశింపఁజేసి, రూపము=(పంచమ్యర్థమునఁ(బ్రథమము రూపము)నుండి. ఉగ్రమయూఖసాక్ష్యము=సూర్యునియొక్క సాక్షిత్వము, విస్మృతి=మఱపు,

(166) విహిత, ఉత్థానుఁడు=చేయఁబడినలేచుటకలవాఁడు. ఛిన్నమిత, ఉత్తమాంగుండు=ఖంచఁబడినశిరస్సుకలవాఁడు,

(170) అగోచర, దుర్గమ, దుర్గవల్లరీ, కుసుమ, సముద్గమంబు=కనఁబడనిదియుఁ, జొరరానిదియునగునడవియందలి తీఁగయొక్క పూవుపుట్టువు

(174) నీలగళ, ఉపమాన=ఈశ్వరునితోఁబోలికగలవాఁడా! "అష్టాభిర్లోకపాలానాం మాత్రాభిర్నిర్మితో నృపః=అనియుండుటంజేసి ఈశ్వరాంశయు రాజునందుఁగలిమి నిట్లుసంబోధించె

(176) రుచిర, అన్నపాన, వివిధ, ఆభరణ, ఆదులన్=మనోహరములగు అన్నపానములు పెక్కుతెగలసొమ్ములు మొదలగువానిచే. సొలయక=వెనుదీయక

(178) ప్రాణఅత్యయమునన్ = ప్రాణముపోవునపుడు. సర్వ, ధన, అపహారణమునన్=ఎల్లధనముల నపహరించునపుడు

(182) కరువలిచేన్ = గాలిచేత. తూలు, కపిల, జటా, ఆళి, అ=కదలుచున్న పచ్చనిజడలగుంపే. విభూతిన్=ఐశ్వర్యముచే

(184) తరుణప్రదేశినులన్=లేఁతజుట్టనవ్రేళ్లతో + ఁమాసరముకన్= పొడవుగా

[186] దానవికిన్=శర్మిష్ఠకు [దానవునికూఁతురు] దీర్ఘ=విశాలములగు, నేత్రి=కన్నులనుండి, నిర్గత=బయలువెడలిన, జలధారలన్=నీటిధారలచే

[191) వదలెన్=సడలెను=వళీపలితంబులు=ముడుతలు, నరయుటలు. వగరున్=శ్వాసము. తలయేరునున్=తలనొప్పి ఉక్కిసయున్=పొడిదగ్గు

[193) రుజయున్=రోగము, కుమతులు=చెడుబుద్ధిగలవారు

(194) నరలు=నరసినవెంట్రుకలు. దుర్వార=వారింపరాని, జరా=ముసలితనమువలని, పరిభూతిన్=అవమానముచే,

(197) అవిచారంబు=ఆలోచనలేమి. అగ్రిసంభవుఁడు = పెద్దకుమారుఁడు, మహీభారప్రగల్భుండు=భూమినిభరించుటయందు సమర్థుఁడు. భార్గవదౌహిత్రుఁడు=శుక్రాచార్యునికూఁతుకొడుకు. జఘన్యఆత్మజున్ చిన్నకొడుకును.

(198) కృత, అవమానుండు=చేయఁబడినయవమానము కలవాఁడు.

(200) భూరి, గుణ, జ్యేష్ఠుఁడు=గొప్పగుణములచేఁ బెద్దవాఁడు. అవనీ, భార, సహిష్ణుఁడు=భూభారమును సహించువాఁడు.

(203) సమంజసబుద్ధిన్=మంచిబుద్ధితో,

(206) వదన=నోరు అనెడు, బాణాసన=విల్లునుండి, వ్యక్త=స్పష్టముగా, ముక్తములు=విడువఁబడినవి. ఆర్జవము=నిష్కపటత. అక్షజయము=ఇంద్రియముల గెలుచుట,

(212) ఉరుతరద్యుతి=మిక్కిలిగొప్పకాంతి,

(217) అధఃభువన, పరిపాత, సంభ్రమ, వివశ, ఆత్మన్=క్రిందిలోకమునఁ బడుటయందలితొందరపాటుచేఁ గలఁగినమనస్సు కలవానిని.

(222) మాన, అగ్నిహోత్రమున్=గౌరవముకొఱకుఁ జేయు అగ్నిహోత్రమును. మాన, అధ్యయనము=గౌరవమునకుఁ జేయు వేదపాఠము. మాన, మౌనంబు=గౌరవార్థముచేయుతపస్సు. మాన, యజ్ఞము=గౌరవమునకగు యజ్ఞము.

(227) వీరశ్రీ, వనితా, ఆశ్రిత, భూరి, స్థిర, బాహుదండ=వీరలక్ష్మియను స్త్రీచే ఆశ్రయింపఁబడిన పెద్దస్థిరమగు బాహుదండములు కలవాఁడా! పుర అరాతిపద, అబ్జ, పూజన, ఆసక్తమతే=ఈశ్వరునిపాదపద్మములయొక్క పూజయందు ఆసక్తమగుమనస్సు కలవాఁడా!

(228) దండిత, అహిత, వీర=శిక్షింపఁబడిన శత్రువీరులు కలవాఁడా! దాన వినోద=ఈవియే వినోదముగాఁ గలవాఁడా! వైరి వేదండ=శత్రువులయేనుఁగుల యొక్క, గండ=చెక్కిళులను, విదారి=చీల్చునట్టి, ఘోరతర=మిక్కిలిభయంకరమగు, అసి=కత్తిచే, భాసి=ప్రకాశించు, భుజార్గళా=గడియవంటిభుజము కలవాఁడా!

# చతుర్థాశ్వాసము

(1) శ్రీ, లలనా, స్తన, ఘటిత, విశాల, ఉరస్‌స్థల=లక్ష్మియను స్త్రీయొక్క కుచములచే ఒత్తఁబడిన వెడఁదయగు ఱొమ్ముగలవాఁడా! వివేక, చతుర్, ఆనన =జ్ఞానమునందుబ్రహ్మవంటివాఁడా!

(6) బాల, హారిణములన్=చిన్న లేండ్లను. విషమ, అటవీ, చలిత, కేసరి, శార్దూల, ఇభ, శరభములన్=భీకరంబులగు అడవులయందుఁదిరిగెడుసింగములను బులులను ఏనుఁగులను శరభమృగంబులను

(8) సమస్త, ఆశా, అంత, మాతంగ, మర్యాదా. అలంకృతము=సమస్తములైనదిగంతములందలి ఏనుంగులయొక్క హద్దులచే నలంకరింపఁబడినది. ఆదిత్య, అంశు, సమీర, దుర్గమ, మహత్, ఉగ్ర, అరణ్య, దేశ, ఆళితోన్ =సూర్యకిరణంబులకును వాయువునకును జొరరానివియు గొప్పవియు భీకరములైనవియు నగు అరణ్యప్రదేశములసమూహములతో. అజితుండు=ఓటమిలేనివాఁడు

(9) రుజా, శోక, ఆతంక, క్షయ, శంకా, అపేతంబు=రోగములనుండియు. దుఃఖములనుండియు, కష్టములనుండియు, భయములనుండియుఁదొలఁగినది.

(11) దుష్యంత, మహోబల, మందరనగము=దుష్యంతునియొక్క గొప్పచతురంగబల మనెడుమందరపర్వతము. అర్ణవ=అబ్ధిపును. బొబ్బయున్=మ్రోఁతయు. సత్వ, భయ, జనకంబు=ప్రాణులకు భయమును గలిగించునది.

(12) సరభస=వేగముతోఁగూడినట్లు, పరిచలిత=వెళ్లుచున్న, మహత్=గొప్ప, శరభ=శరభములు, ద్విపరిపు=(ఏన్గులకువిరోధులు)సింహములు, వరాహ=అడవిపందులు, శార్దూల=పులులు, మదద్విరద=మదపుటేనుఁగులు, ఆది=మొదలగువానియొక్క, ప్రకర=సమూహముచే, భయంకర=భయమునుగలిగించు, వన=అడవియొక్క, మధ్యమునన్=నడుమ

(13) ఓసరిలి=తొలఁగి, భుజ, అసిన్=భుజమునందలికత్తితో. మృగయా, వ్యాసక్తిన్=వేఁటయందలిఆసక్తిచే. అపార, ఘోర, వన్య, మృగ, అనేకన్=అంతులేనిభయంకరము లగువనములోనిమృగములయొక్క సమూహముచ

(17) అతి,రుచిర,ఆగతుంకు=మిక్కిలియందగాఁడైనయతిథి. ఆతతము=విశాలము. మృగుల,అనిల,అపహర్జిత,కుసుమ,అక్షత,ఆవళులు=తిన్ననిగాడ్పులచేరాల్పఁబడిన పూవులు అను అక్షతలయొక్క సమూహములను. సంపతత్, అళినీ, నినాద, మృదు భావలన్=వ్రాలుచున్నయాఁడుతుమ్మెదలఝుంకారము లనెడుమెత్తనిమాటలచే. సేసలు=తలఁబ్రాలు

(20) తలిర్చినకొమ్ములన్=చిగిర్చినగోరంటులచే. ఇమ్ము=అందము. జొంపములన్=గుబురులను. సహకారములన్=తియ్యమామిడులను.

(21) ఆజ్య=నేయియొక్కయు, హవిః=హవిస్సుయొక్కయు, ధృత=ధరింపఁబడిన,సౌరభ=వాసనలుగల,ధూమలతా=తీఁగలవంటిపొగలయొక్క తతులన్=సమూహములచేతను. అపేత,లతాంతములు=పోయినపువ్వులుకలవి మధుప,ప్రకరంబులన్=తుమ్మెదలగుంపులను.

(23) కరి,కర,శీతల, చ్ఛాయన్=ఏనుఁగులతొండములయొక్కచల్లనినీడయందు. తత్, శీకర, అంబు, కణముల, చల్లనిగాడ్పు=వానితుంపరలగునీటిచుక్కలయొక్కచల్లగాలి (ఇందు శీకర, అంబుకణశబ్దములలో నొక్కటియున్నఁజాలును.)సహజ,వైరి,వర్గంబులు=స్వభావముచే శత్రుగణంబులు,

(25) సంకుల,మిళిత,అళి,నీల,పరికుంచిత,కోమల,కుంతలన్=దట్టముగాఁగలసియున్న,తుమ్మెదలవలెనల్లనివియు ముడువఁబడినవియు నగుమెత్తని వెండ్రుకలు కలదానిని,

(27) క్రచ్ఛిఅన్=వడిగా,

(29) అతి, అగణిత, ధర్మ, స్వరూపుఁడు=ఏమాత్రములెక్కఁబెట్టరాని ధర్మమే స్వరూపము గాఁగలవాఁడు,

(34) ఈ + కార్శ్యపులు,పూజయందు బహువచనము.

(36) విశ్వామిత్రుఁడు, విశ్వ + మిత్రుఁడు'మిత్రే చర్షౌ' అను పాణినీయ సూత్రముచేఁబూర్వపదమునకు దీర్ఘము వచ్చినది.

(37) వనజ,భవ,ప్రభావుఁడు=బ్రహ్మయొక్క మహిమవంటిమహిమగలవాఁడు. అపత్యశోకము=సంతానదుఃఖము. అనిమిషులు=వేల్పులు(ఱెప్పపాటులేనివారు)

(39) గోత్రధారుణీధరమ్ములు=కులపర్వతములు.

(40) అలలనా=ఆస్త్రీయొక్క, ధమ్మిల్ల=కొప్పునందలి, కుసుమ=పూల యొక్కయు, అంగరాగ=మైపూఁతయొక్కయు, సముల్లసన=వ్యాప్తిచే, సుగంధి=మంచిగంధముకలది.

(41) నవ, లతాంత, విభూషణ, శీలన్=క్రొత్తపూవులు అనుసొమ్ములయొక్క విలాసముచే. కౌశిక=ఇంద్రునియొక్క, చిత్త=మదికి, భీతి = భయమును, సంజనన = పుట్టించు, మహత్ = గొప్ప, తపః=తపస్సును, చరణ=చేయుటచే, సంయత = కట్టివేయఁబడిన, చిత్తున్ = మనస్సుకలవానిని. నిరస్త, చిత్తజున్= త్రోసివేయఁబడినమన్మథుఁడుకలవానిని(కామవికారములేనివానిని).

(42) పుష్ప, అపచయ, వ్యాజంబునన్=పూలుకోయుటయను నెపముచే. అపచయశబ్దము మస్తమని వామనాచార్యుఁడు—సూ—అవతరాపచాయశబ్దయో ర్దీర్ఘ వ్యత్యాసో బాలానామ్—ఏతత్సమర్థనంబు మదీయాశతలక్షణీయందు దారయునది.

(43) అలసత=అలసట. ఆ, మిళిత, సుగంధ, బంధుర, సమీర, వశంబునన్, =ఆ, కలసికొన్న మంచివాసనచేఅందమగుగాలియొక్క అధీనతచే. బాలపై వలువ=మేనకపైఁట తగళ, త్రివళీ, యుత, రోమరాజియుక్=చలించుమన్న మూఁడుముడుతలతోఁగూడిననూగారును.

(44) కందర్ప, నిశాత, సాయకంబులు=మన్మథునివాఁడిబాణములు,

(46) క్రవ్యాద, ఘోర, మృగములు = మాంసములఁదిను క్రూరములగుమృగములు. శకుంత, తతులు = పక్షులగుంపులు,

(48) భయత్రాత = భయమునుండి కాపాడినవాఁడు(ప్రకృతము శకుంతలకుఁ గణ్వుఁ డీవిధముగాఁ దండ్రి) ఉపనేత=ఉపనయనముచేసినవాఁడు,

(51) నిజ, ఆభిజాత్య, సంపదక్=తనగొప్పకొలమునందలిపుట్టువుయొక్క యతిశయమును. అళి, పాత, ప్రకంపిత, పంకజ, ఆకృతిక్=తుమ్మెదవ్రాలుటచేఁగదలు తామరవలె

(52) ఈ, వల్కల, అజినములకుక్=ఈనారచీరలకును, లేఁడిచర్మములకును. ఈ, వన్య, ఫల, అశనములకుక్=ఈఅడవిలోనిపండులఁదినుటలకు. ఈ విటప, కుటీర, ఆవాసములకుక్=ఈఆకుటిండ్లనునికికిని.

(58) అనిందిత, ఇందుపాద, అమల, తుంగ, హర్మ్యములన్ = నిర్దోషములును, చంద్రకిరణములవలె నిర్మలములును, ఉన్నతములును, అగు మేడల యందు. హారి, హిరణ్మయ, కుట్టిమంబులన్ = మనోహరములగు బంగారుపు కట్టడపు నేలలుగల,

(59) మహీ, గురుతర, యౌవరాజ్యమునకున్ = భూమియొక్క మిక్కిలి గొప్పదియగు యువరాజపట్టమునకు,

(61) అఖిల, భువన, వహన, వహనీయుఁడు = సమస్తలోకములను వహించుటయందు గొప్పవాఁడు.

(63) కణ్వ, ఆశ్రమ, ఉపాంత, భూజములందున్ = కణ్వునియాశ్రమమునకు సమీపమునందలి చెట్లయందు, శాకుంతిలుండు = శకుంతలయొక్క కుమారుఁడు. ఇచ్చట "స్త్రీభ్యో ఢక్," అని ఢక్ ప్రత్యయాదులు వచ్చి శాకుంతలేయుఁడని కావలసినను ఉత్సర్గశాస్త్రమునే మహాకవి ప్రవర్తింపఁజేసెనని యెఱుంగునది. విస్తరము శతలక్షుశేయుఁగుఁజూడఁగు.

(68) బహు, కార్య, భార, మగ్నులు = పెక్కు కార్యములయొక్క బరువునందు మునిఁగినవారు

(71) కపటికిన్ = మోసగానిని,

(79) పురుషవృత్తము = పురుషులనడతను,

(81) అవజ్ఞా, అన్విత, దృష్టిన్ = అవమానముతోఁగూడిన చూపుతో,

(84) విమలచారిత్రశిక్షకున్ = నిర్మలమైననడవడిని నేర్పుటకు, ఆచార్యకంబు = ఒజ్జతికము,

(88) పుత్ + నామ్నః = పుత్ అను పేరుగల, నరకాత్ = నరకమునుండి, త్రాయతే = రక్షించుచున్నాఁడు. (కాన) పుత్రః = పుత్రశబ్దవాచ్యుఁడు.

(90) విపరీత, ప్రతిభాషలు = విరుద్ధములగు మాఱుమాటలు. ఈ, పుత్ర, గాత్ర, పరిష్వంగ, సుఖంబు = ఈకుమారుని శరీరమును కౌఁగిలించుకొనుటవలని సుఖమును. ముక్తాహార, కర్పూర, సాంద్రపరాగ, ప్రసరంబున్ = ముత్యములపేరులను, పచ్చకప్పురముయొక్క దట్టమగు ధూళియొక్క ప్రసారమును. చంద్రజ్యోత్స్నయున్ = చంద్రుని వెన్నెలయు. హృద్యంబు = మనోహరము,

(92) దారకున్ = పిల్లవానిని,

(109) భాస్కర, జహ్నుకన్యకా = సూర్యునియొక్కయు జహ్నునియొక్కయు, కన్యకలయొక్క, అనఁగా యమునా గంగానదులయొక్కయని భావము. సురుచిరతీరదేశములన్=అందములగు ఒడ్డులయందు, శుద్ధ, సువర్ణ, గో, అశ్వ, హస్తులన్=శుద్ధములగు బంగారునాణెములను, ఆవులను, గుఱ్ఱములను ఏనుగులను. గో + అశ్వ, గవాశ్వ "అవఙ్ స్ఫోటాయనస్య=అని అవఙాదేశము వచ్చినది.

(130) తురీయ, అర్ధముల్=నాల్గవపాలులో సగము

(134) నిజ, అంగ, దీప్తులు=తనశరీర కాంతులు. తోయరుహ, ఆయత, చారు, నేత్రి=పద్మములవలె విశాలములును అందములును అగుకన్నులుకలది. ప్రతీప వసుధాధిప, శాల, విశాల, దక్షిణ, ఉత్సంగముసన్=ప్రతీపరాజుయొక్క వద్ది చెట్టువలె విశాలమగు కుడితొడయందు.

(139) సంతత, అర్థ, దాయి=ఎల్లప్పుడు ధనమునొసఁగువాఁడు

(143) తరళ, ఆయత, లోచనన్=చంచలములును విశాలములును అగు కన్నులుకలదానిని. ఉత్తమ=శ్రేష్ఠములైన, దివ్య=దేవసంబంధములగు, అంబర=వస్త్రములచేతను, మాల్య=పూలదండలచేతను, మణిమయ=రతనాలవికారములగు, అలంకరణ=సొమ్ములతో, ఉజ్జ్వల=ప్రకాశించునట్టి, వేషన్=దుస్తులుకలదానిని.

(152) పుత్త్రఘాతినివి=పిల్లలను జంపుదానవు

(154) అపేత, వ్యసనులు=పోయినదుఃఖముగలవారు

(156) ఉరు, రత్న, రాజిత, సుమేరు, మహీంధర, కందరంబునన్=గొప్ప, రత్నములచేఁబ్రకాశించెడు మేరుపర్వతముయొక్క గుహయందు

(162) దిక్, వనితా, మౌక్తికదామ, లీలన్=దిక్కులనుస్త్రీలకు ముత్యములదండవలె,

(164) అసుర, ఆపగా, ఓఘముల్=ఆకాశగంగా ప్రవాహమును. ఆపగేయున్=నదీపుత్త్రుని.

(170) కనక, అవదాత, కోమల, తనులతికన్=బంగారమువలెఁబచ్చనిదియు మృదువైనదియు నగుతీఁగవంటిశరీరముకలదానిని

(171) దాని, విలోల, విలోకనంబులున్ = దాని చంచలములగు చూపులును. దాని, శుచి, స్మిత, వక్త్ర, కాంతియున్ = దానియొక్క తెల్లని చిఱునవ్వు గల ముఖముయొక్క కాంతియు.

(178) భవత్, అభిరక్షిత, క్షితికిన్ = మీచే రక్షింపఁబడు భూమికి

(182) అరి, విద్రావణ, సాహసికుండవు = శత్రులను పాఱఁదోలుటయందు సాహసముకలవాఁడవు

(184) సాపత్న్యము = శత్రుత్వము

(188) భావి, భవత్, సుతులు = కలుగఁబోవు నీకుమారులు

(194) విచిత్ర, పత్త్ర, కార్ముక, హస్తున్ = చిత్రములగు బాణములు ధనుస్సు చేతియందుఁగలవానిని

(200) నర, నాగ, అశ్వ, వరూథ, యూథములతో = కాల్బలముల యొక్కయు ఏనుఁగులయొక్కయు గుఱ్ఱములయొక్కయు రథముల యొక్కయు సమూహముతో. ఉద్ధతులు = గర్వించినవారు. ఉత్తుంగ, అనిల, ఉద్ధూత, సాగర, సంక్షోభ, సమంబు, కాన్ = పెనుగాలిచే రేఁగఁగొట్టఁబడిన సముద్రపుఁగలఁతతో సమానముగా

(201) కపిమసంగి = చెలరేఁగి

(204) మదీయ, ధనుః, విముక్త, నానావిధ, మార్గణ, ఉగ్ర, గహనంబునన్ = నాదైనవింటినుండి విడువఁబడిన పలువిధములగు బాణములను భయంకరమైనయడవియందు,

(2(6) పరికాఁడు = మేటియేనుఁగు,

(216) అమల, సుధా, రమ్య, హర్మ్యతలంబులన్ = తెల్లనిసున్నముచే అందమగు మేడలందు. నవ, కుసుమ, ఆమోద, నందనములన్ = క్రొత్తపూవుల వాసనలుగలపూఁదోఁటలందును. ఉద్యానవిశేషవాచకంబగు నందనపదము ఇందు ఉద్యానసామాన్యపరముగా వాఁడఁబడినది. కృతక, అద్రి = ఆట కొండలయొక్క, కందర = గుహలు అను, క్రీడాగృహ = విలాసమందిరముల యొక్క, అంగణ = ముంగిళ్లయందలి, వివిధ, రత్న, ఉపల, వేదికలన్ = పలు తెఱంగుల రతనాల యఱుఁగులయందును.

(2[illegible]3) హిమకరుఁడు = చంద్రుఁడు. అర్యముఁడు = సూర్యుఁడు. హుతాశనుఁడు = అగ్ని. గుహ్యకము = [illegible]

(225) సమర,దర్పితున్=యుద్ధమున గర్వించినవానిని.

(232) పుట్టుఁజీకున్=పుట్టినప్పటినుండియుఁగ్రుడ్డివానిని, పూతిగంధ,ఆననున్=దుర్గంధము నోటఁగలవానిని,

(237) "కాపించు విచిత్రవీర్యక క్షేత్రమునన్"=ఇందు "క"ప్రత్యయము యతిమాత్రనిర్వాహణార్థమగుటచే నిరర్థకము.

(239) పింగళ, విశాల,జటా, చయము=పచ్చనినిడుదలగుజడలగుంపు, హరినీల, వినీల, విగ్రహ, అరాళ,రుచుల్=ఇంద్రనీలమణులవలె నల్లని శరీరముయొక్క వంకర కాంతులు,

(244) "దేవరన్యాయమునన్" భర్త యనపత్యుఁడై చనిపోయినచో స్త్రీ భర్తృసోదరునివలన సంతతిని గాంచుట దేవరన్యాయము.

(250) అయ, నయశాలి=శుభకరమగువిధిచేతను నీతిచేతను బ్రకాశించువాఁడు.

(253) కపిలగడ్డంబును=పచ్చనిగడ్డమును, ఇందుఁగపిలశబ్దము కపిలశబ్దభవము.

(255) బలవత్,మదనాగ,అయుత,బల,యుతుఁడు=బలముగలమదపుటేనుంగులపదివేలింటియొక్క బలముతోఁగూడినవాఁడు, ప్రజ్ఞాచక్షుండు=బుద్ధియే కన్నుగాఁగలవాఁడు—వేఱేకన్నులు లేనివాఁడు,

(256) పాండుర, విరాజిత అంగుఁడు=తెల్పుచేఁబ్రకాశించుశరీరము కలవాఁడు,

(262) తాపికాఁడు=కూర్చువాఁడు,ఆరకులు=కావలివారు.

(274) త్రిభువన, అంకుశ=మూఁడులోకములకును అంకుశమువంటి వాఁడా! ఇది రాజరాజనరేంద్రుని కొకబిరుదు. శుభ,యశః,పరిశోభిత మంగళకరమగుకీర్తిచేఁబ్రకాశించువాఁడా! పూర్వదిక్ప్రభువిలాస ఇంద్రుని విలాసములవంటివిలాసములు కలవాఁడా!

---

చంద్రికా ముద్రాక్షరశాల, గుంటూరు.

## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| పుస్తకం సంఖ్య | TPLA120B124 |
| --- | --- |
| పుస్తకం పేరు | శ్రీమదాంధ్ర మహాభారతము ఆది పర్వము |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 269 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | nazma |
| పేజీలు విడదీసినది | nazma |
| స్కాన్ చేసేవది | Aswini |
| పరీక్ష చేసేవది | KASIMBI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |